శుద్ధోదనుని చోరు చేయుటకు యెట్లు వీలగునో ప్రజలకు ఉపయోగకరమగు గ్రంథములను కూడ చోరు జేయవచ్చునని దీనివలన ఋజువగుచున్నది.

కాపూరులో బుద్ధభగవానుని జయంతి జరుపు రోజున యీ పుస్తకము వెలువడుట నాయదృష్టము.

" త్యాగమహిమా ! " ఆంధ్రభాషకును, ఆంధ్రదేశమునకును, ఆంధ్ర ప్రజలకును, వినయ విధేయతలతో, ధర్మసేవ జేయుమా! ఆంధ్రత్వమున పులకరించెడి త్యాగోత్సాహములతో, మైత్రి నెరపి వానిని స్థిరపరచుమా !

| | |
|---|---|
| తెనాలి, | |
| వైశాఖ శు॥ ౧౦, గురువారం | ఇట్లు, |
| ౪—౫—౧౯33. | గొల్లపూడి శీతారామశాస్త్రి |

# వి ష య సూ చి క

—...—



———

# త్యాగమహిమ

—[ యాసునికథ. ]—

—(౧)—

గౌతమబుద్ధుడు కాశీపట్టణమునందు తన ధర్మమును బోధించెడి కాలములో ఆనగరపు ముఖ్యశ్రేష్ఠికి యాసునుడను ఒక కుమారుడు గలడు. అతనికి వేసవికి ఒక రాజమందిరమును, వానకాలమునకు ఒక రాజమందిరమును, చలికాలమునకు యింకొక రాజమందిరమును ఉండెను. ఒక్కొక్కదానిలో నాలుగు నెలలు గడుపుచుండెను. ఆటకత్తెలును, పాటకత్తెలును, సేవకులును, దాసీలును, ఆతని కనుసైగల మెలగుచుండిరి. అతను యౌవనవంతుడును, బలవంతుడును, అయి పంచేంద్రియముల మూలమున పెక్కుసుఖముల బడయుచుండెను. సౌందర్యవతియగుభార్యతో సంసారము చేయుచుండెను. ధనధాన్యసంపదలకు కొదువలేకుండెను. ప్రేమసంతులైన తలిదండ్రులు కనురెప్పలవలె వానిని కాచుచుండిరి.

వానకాలమున ఒకనాడు వాడు పెందలకడ నిద్ర లేచెను. పరివారమంతయు యింకను నిద్రించుచుండెను. మేడమీద తంబురతో నొకతె, చాపపై వీణెతో నింకొకతె; మద్దెలపై చేతితో నొకతె, కొప్పువీడి చిక్కువడిన వెండ్రుకలతో నింకొకతె, నోటినుండికారెడు చొంగతో మరియొ

కతే పలువురు పలువిధములపడియుండిరి. అందరును నిదురలో గొణుగుచుండిరి. ఆచోటంతయు స్మశానమువలె ఆతనికి కనుబడెను. సంసారసుఖములలోని దోషముల నతను కనిపెట్టెను. మనసులో విసుగుపుట్టెను. అయ్యో యెంతఆపద! యెంత దుఃఖము! అని చింతించుచుండెను.

బంగారుపోతబోసిన చెప్పులు దొడుగుకొని మేడవాకిలి వద్దకు వచ్చెను. మానవులుగానట్టి వ్యక్తులు ఆవాకిలి తెరచిరి. కొంతదూరము నడచి నగరము బైటగుమ్మము వద్దకు చేరెను. ఆవాకిలియు అట్లే తెరువబడియుండ దానిగుండ బయలువెడలి యీయువకుడు వేళ్లతోటయనుచోటికి వచ్చెను. అప్పుడు బుద్ధభగవానుడు బైటగాలిలో ఇటునటు పచారి చేయుచుండెను. ఈ యాసునిచూచి ఒకచోటపీటపై ఆయన కూరుచుండిరి. అయ్యో! యెంతదుఃఖము! యెంతఆపదయనుచు యాసుడు పలువరించుచుండ భగవానుడాతనితో నిట్లనియెను. "ఇచ్చట దుఃఖములేదు. ఇచ్చట ఆపదలేదు. యాసా. ఇటు రమ్ము, కూర్చుండుము. నేను నీకుధర్మమును బోధించెదను."

ఆమాటలు వినగానే యాసుని చింతదీరెను. సంతోషము కలిగెను. చెప్పులు విడిచి, బుద్ధుని సమీపించి, భక్తితో నమస్కరించికూర్చుండెను. ఆతనికి దానముచేయుట వలన కలుగు ఫలమును, ధర్మవిధులును, స్వర్గమును, కోరికలలోని చెడుగును, పాపమును, కోరికలు విడుచుటవలన దొరకెడు సౌఖ్యమును, అనగా నిష్కామకర్మవల్ల మేలును, బుద్ధుడు బోధించెను. కాని మనసులోని అడ్డంకులుతీరి మెత్త

బడి ఉత్సాహముకలిగి, ఉత్తమబోధకు అనుకూలముగా నుండువేళ బుద్ధుడు తనముఖ్యధర్మములను బోధించెను. నల్లమరకలులేని తెల్లబట్టకు తేలికగారంగుపట్టినట్లు యాసుని జ్ఞాననేత్రము తెరువబడిధర్మరహస్యమును జూచెను. పుట్టినవెల్లను గిట్టక తప్పదని అతనికి స్పష్టమయ్యెను.

ఇంటివద్ద యాసునితల్లి యాసుని గాంచక మేడలలో వెదకించి పెనిమిటితో యీసంగతి చెప్పెను. అతడును నలుదెసలకు గుఱ్ఱపురౌతులబంపెను. తాను స్వయముగా వెళ్ళి తోటవైపుకు బయలుదేరి కుమారుని బంగరు చెప్పుల జాడలను ఆనవాలుబట్టి ఆత్రోవనే చని చని బుద్ధుని గాంచెను. "ప్రభో! యాసుని జూచితిరా?" అని అడిగెను. "శ్రేష్ఠీ! ఇచ్చటనే నీవు యాసుని చూడగలవు. కూర్చుండుము." అని బుద్ధుడు జవాబుచెప్ప ఆగృహస్థుడు సంతసముతో ఉప్పొంగి బుద్ధునికి వందనముచేసి చెంత కూర్చుండెను. ఆతనికి బుద్ధుడు యథాప్రకారము బోధించెను. బుద్ధుడు అనేక ఉపమానములతో దుర్వ్యయము, దుష్టస్వభావము, చాపల్యము, అన్నవస్త్రముల విషయములో ఎన్నటికిని తృప్తి పొందకుండుట, జనులమధ్యనే కాలముగడుపుట, సోమరితనము అను యీ దోసగుణములను ఖండించెను. పొదుపు, సుశీలము, మితము, తృప్తి, పాపమును తొలగించుట, ఔదార్యము, భక్తి, శ్రద్ధ ఈ సుగుణములను స్తుతించెను. శ్రద్ధయు, భక్తియు, నిష్ఠయు, ఎడతెగని పరిశ్రమయు, ఇతరులయెడ పూజ్యభావమును మెచ్చుకొనెను. దానముచేయుటనుగూర్చియు, పుణ్యమునుగూర్చియు

స్వర్గమునుగూర్చియు కామము, క్లేశము, కర్మము అనుమూడు ఉపాధులయొక్క నీచత్వమును, నిష్ప్రయోజనమును, వానిచే కలుగు ఆపదలనుగూర్చియు, ఈ మూటిని త్యజించుటవలన గలిగెడి లాభములనుగూర్చియు, ఉపన్యసించెను. ఇది విని మనస్సు సున్నితమై మెత్తబడి అపోహలుతీరి పైమెట్టునకుచేరి ఉత్సాహమును పొంది విశ్వాసమును కలుగుటకు అనుకూలమైన స్థితిలోనుండగా అప్పుడు ఆయన తథాగతుల ప్రత్యేక సిద్ధాంతములనుగూర్చి బోధించెను. దుఃఖము, దానిపుట్టుక, దాని నాశనము, అష్టాంగమార్గము గూర్చి వివరముగా ఉద్బోధించెను. ఉత్పత్తియైన ప్రతివస్తువులోను దానిని నశింపజేయు కారణము అప్పుడే యిమిడియున్నదని వారికి నచ్చచెప్పెను. అంతవారికి ధర్మముయొక్క పవిత్రమైన నిష్కళంకమైన దృష్టికలిగెను. (ఇట్టి ఉపన్యాసమును బౌద్ధులు ధర్మకథ అందురు. మనము ధర్మోపన్యాసములు లేదా ధర్మబోధ అనవచ్చును.) అది వినినంతనే అతడు ధర్మమును చూచి గ్రహించి లోతుపాతులనుకనిపెట్టి అనుమానములవీడి యితరుల ఆధారము లేకుండగనే సంపూర్ణజ్ఞానమును సంపాదించెను. అంత ముప్పిరిగొన్న ఆనందముతో "మహాప్రభో! బోర్లపడిన గిన్నెను సరిగాపెట్టినట్లు, దాచినదానిని బయలుపరచినట్లు, దోవతప్పినవానికి దోవచూపినట్లు, చీకటిలోనికి దీపము తెచ్చినట్లు అన్ని సంగతులు నీబోధవల్ల నాకు తెలిసిన" వని బుద్ధుని పొగడెను. "భగవానుడగు బుద్ధునిలోను, బుద్ధుని ధర్మములోను, భిక్షుసంఘములోను, శరణుజొచ్చెద, నన్ను మీ

శిష్యునిగా జేకొమ్ము." అని వేడుకొనెను. అట్లు తండ్రి వినుచుండ కుమారుడు ఆబోధయంతయు గ్రహించుకొనెను. ప్రపంచమునందలి సంగము వీడెను. ఆసవములు అను ఇంద్రియరసములనుండి విముక్తుడయ్యెను. అది బుద్ధుడు గ్రహించెను. యాసునిజూచి అతనితండ్రి "కుమారా! మీతల్లి చింతతో కృంగుచున్నది. ఆమెను ఓదార్చిప్రాణమును తెప్పరిల్లజేయుము" అని కోరెను. అప్పుడు ఆయాసుడు బుద్ధుని వైపుజూచెను. బుద్ధుడు ఆ గృహస్థుని యిట్లు ప్రశ్నించెను. "శ్రేష్ఠీ! నీకుమారుడు చక్కగా ధర్మమును గ్రహించలేదువా. లోకబంధనములు ఆసవములు వీడలేదందువా. అట్లు వీడినవాడు తిరిగి గృహస్థు అయి ఇహలోకసౌఖ్యముల మునుపటివలె అనుభవించగలడా?" దానికి "అట్లు జరుగనేరదు." అని ఆ శ్రేష్టిబదులుచెప్పెను. "ఇది నాకుమారుడగు యాసునకు ఉపకారమే. ఆనందకరమే" అని అతడు ఒప్పుకొని బుద్ధుని యాసుని, మరునాడు భిక్షకు తన ఇంటికి పిలచెను. బుద్ధుడు మౌనముగానుండి ఆవిందునకు అంగీకరించెను.

అంతట ఆ శ్రేష్ఠి తన ఇంటికిపోయెను. యాసుడు తనకు భిక్షుసంఘపుదీక్షయిప్పించమని బుద్ధుని వేడుకొనెను. బుద్ధుడు దీక్షనొసంగి యిట్లు ప్రోత్సహించెను. "దుఃఖము అంతయు పూర్తిగా నశించుటకొరకు పవిత్రమైన జీవితమును గడుపుము" అప్పటికి బౌద్ధసంఘములోచేరిన ఆరవ అర్హతుడు ఈ యాసుడు.

మరునాఁడు బుద్ధుఁడును, యాసుఁడును ఆ శ్రేష్టిగారి ఇంటికి భిక్షకుఁబోయి వారిచే పూజింపఁబడి వారు అర్పించిన భిక్షను గైకొనిరి. యాసునితల్లికిని, భార్యకును బుద్ధుఁడు బోధించెను. వారిద్దరును బుద్ధునికి శిష్యులైరి. కుటుంబమార్గములోనుండి శిష్యులైన మొదటి ఆడవారు వీరు ఇద్దరే.

ఈ యాసుఁడిల్లు తలగొరిగించుకొని కాషాయవస్త్రములను ధరించెనని అతని స్నేహితులు, పట్టణములోని పెద్ద కుటుంబీకులు నలుగురు వినిరి. విని తమ మిత్రుడు యాసుని మార్చిన ధర్మము సామాన్యమైనది కానేరదు. ఉత్కృష్టమైనదియై యుండవచ్చును. అని యెంచి ఆ నలుగురును యాసుని సమీపించిరి. వారలను యాసుఁడు బుద్ధునియొద్దకు తీసుకొనిపోయి పరిచయము కలుగజేసెను. బుద్ధుని బోధలను విని, వారి మనసులు విప్పారి బాధనములు తెగిపోయి వారును భిక్షువులయి దీక్షను పొంది అర్హతులయి ఆనందము నొందిరి.

.........

## — సోణుని కథ, —

—(o)—

అంగదేశమునకు రాజధాని చంపా యనుపట్టణము. బుద్ధునికాలమున యీ అంగదేశమును మగధరాజ్యములోనే చేర్చుచుండిరి. ఆ చంపా యను పట్టణములోని పెద్దశ్రేష్టికి సోణుఁడను కుమారుడు కలడు. అతనిని అతిగారాబముతో మేచారముగా పెంచుచుండిరి. అతడు భూమిమీద అడుగిడు

వాడుకాదు. అందుచే అతని అరికాళ్లలో వెండ్రుకలు మొలచెను. ఒకనాడు మగధరాజైనబింబిసారుడు తనరాజ్యములోని యెనుబదివేలగ్రామాధిపతులతో కొలువుదీర్చి యుండెను. అప్పుడుసోణునిసంగతివిని,వానినిపిలువనంపించెను. సోణుడుపల్లకీలో బయలుదేరెను. "నాయనా! రాజు నీ అరికాళ్లు చూడగోరుచున్నాడు. కాని రాజువైపునకు కాళ్లుచాపరాదు. రాజుయెదుట పద్మాసనము వేసుకొనికూర్చుండవలెను. అప్పుడు రాజు నీకాళ్లను జూడవీలగును" అని ఆతని తలిదండ్రులు వానికి బోధించిరి. సోణుడంత రాజసభకువచ్చి రాజునకు సాష్టాంగమొనర్చి ఆతని అష్టవోష్పున తలిదండ్రులు చెప్పిన విధమున కూర్చుండెను. అప్పుడుబింబిసారుడు ఆతనికాళ్లపైన మొలచిన వెండ్రుకలనుజూచి ఆశ్చర్యపడెను.

బింబిసారుడు రాజ్యాంగ విషయములలో గ్రామాధిపతులను హెచ్చరించి బుద్ధుని దగ్గరకు పోవలెననియు, ఆయన శాశ్వతధర్మములను గురించి మీకు బోధించుననియు సెలవిచ్చెను. రాజు సెలవుప్రకారము వీరందరును బుద్ధునితావునకు చేరవచ్చిరి. బుద్ధుని చూడగనే వీరికి గౌరవభావము కలిగెను. ఆయన వీరలకు దానము, పుణ్యము, స్వర్గములను గూర్చియు, కామములయొక్క నీచత్వమును గూర్చియు, త్యాగముయొక్క ఆధిక్యతను గూర్చియు, విపులముగా బోధించెను. వారి హృదయములు కరిగి అనుమానములుతీరి సంకటములు తొలగి భక్తి విశ్వాసములు నెలకొనుచుండ బుద్ధుడు వారలకు లోకములోని దుఃఖమును గూర్చియు, దాని కారణ

మునుగూర్చియు, దాని నాశనమును గూర్చియు ఆర్యఅష్టాంగమార్గములగూర్చియు, వివరించి చెప్పెను. వారు జ్ఞానప్రసాదమునుపొందిరి. బుద్ధుని స్తోత్రము చేసిరి. ఆ ధర్మమును మెచ్చుకొనిరి. తాము బ్రతికియున్నంతమేర బుద్ధుని శిష్యులముగా యుందుమని వాగ్దానముచేసి గృహస్థశిష్యులైరి.

వారితోపాటు వినుచుండిన సోణుడు గృహస్థ శిష్యుడుగా యుండుటకు ఒప్పుకొనలేదు. ఈ భగవానుడు బోధించిన పవిత్రధర్మప్రకారము కుటుంబీకుడుగానుండి అరమరిలేని సంపూర్ణమైన పవిత్రవంతమైన జీవితమును గడుప శక్యముగాదు. నాతలను, గడ్డమును గొరిగించి కాషాయవస్త్రములనుగట్టి ప్రపంచమును విడిచి, ఇల్లులేని స్థితిలోనికి చేరకూడదా అని తనలోతాను ఆలోచించుకొనెను. ఇంతలో యెనుబదివేల గ్రామాధికారులును లేచి బుద్ధునికి తమ కృతజ్ఞతను తెలిపి సంతసమును వెలిబుచ్చి భగవానునికి ప్రదక్షిణము చేసి వెడలి పోయిరి. అంత సోణుడు బుద్ధుని సమీపించెను.

బుద్ధునికి నమస్కరించి వారియనుమతిని బొంది ఒకవైపున కూర్చుండి తనకు గలిగిన కోరికను వారికి తెలుపుకొనెను. "నేను లోకమును వీడెదను. భిక్షువునయ్యెదను. ఇళ్ళువాకిళ్ళు వదలెదను. నాపై కరుణించి నాకు దీక్షనిండు" అని వేడుకొనగా బుద్ధుడు వానిని భిక్షువుగా చేసెను. ఈ సోణుడును తీవ్రమైన నిష్ఠతో సాధన చేయుచుండెను. వట్టికాళ్లతో యిటు నటు తిరుగుచుండెను. అలవాటు లేనందున కాళ్ళు బొబ్బలెక్కి నెత్తురు కారుచుండెను. అతను నడిచెడి

చోటెల్ల కసాయివాని కొంపవలె నెత్తురుమయ మయ్యెను. ఈ సోణుడొకపరి ధ్యానములోనుండ యీభావము అతనికి తోచెను. "నాహృదయములో కామము నశించలేదు. ఆసనములు, మొండిపోలేదు. ఇంటివద్ద అమితముగా ధనమున్నది. ఆధనమును అనుభవించుచు, దానములుచేయుచు, కాలము గడుపరాదా; క్రిందిమెట్టుకుదిగి యీరెండు లాభములను పొందరాదా" అనుకొని మరల గృహస్థుడగుదునని తలంచెను. వీనిభావమును తెలిసికొనిన బుద్ధుడు ఆవైపునకు నడలెను.

బాటలోపడియున్న నెత్తురు మరకలను చూచి అచ్చటి భిక్షువులను "ఈనెత్తురు ఎక్కడిది? ఇచ్చట నివసించు భిక్షుకు లెవరు" అని అడిగెను. సోణుడు పట్టుదలతో సాధన చేయుచు తిరుగుచుండ అరికాళ్లు పగిలి నెత్తురు కారెనని వారు చెప్పిరి. అంతట ఆయన సోణుని చెంతను చేరెను. సోణుడు లేచి వారికి పీఠము అమర్చి నమస్కరించి వారిని కూర్చుండబెట్టి తాను కూర్చుండెను. "సోణా! గృహస్థాశ్రమములో ప్రవేశింప తలంపు కలిగెనా మరల నీకు" అని బుద్ధుడు అడిగెను. "అవును ప్రభో" యని సోణుడు జవాబుచెప్పెను. "సోణా! నీవు గృహస్థుగానుండగా వీణె వాయించుటయందు నేర్పరివి గదా" అని అడుగ, సోణుడు "అవును" అని పలికెను. "సోణా! వీణెతీగలను మిక్కిలిగా బిగించినపుడు పాట పాడ వీలయ్యెనా?" అని బుద్ధుడు అడుగ "కాలేదు" అని సోణుడు జవాబుచెప్పెను. "పోనీ, సోణా! ఆతీగలను

చాలవదులుగా వుంచినపుడు పాటసాగెనా ? " యని మరల బుద్ధుడు ప్రశ్నించెను. " అప్పుడు అసలే సాగలేద " ని సోణుడు మనవిచేసుకొనెను. " అయితే సోణా ! మిక్కిలి బిగించక, మిక్కిలి వదులుచేయక సరిగా అమర్చిన యెడల మీావీణె చెవులకింపుగా పాటపాడునుగదా." అని బుద్ధుడు సూచించినదానికి " నిజమే ప్రభో " యని సోణుడు మారు పల్కెను. " ఆవిధముననే సోణా అత్యాతురమునలన అభిమానము గలుగును. పట్టుదల లేనియడల సోమరితనము యేర్పడును. ఈ రెంటిని వీడి స్థిరబుద్ధికలవాడవై చలించని నిష్ఠతో సౌమ్యముగా నీమానసిక శక్తులను ఏకతానము చేయుము అట్లు ఆదర్శము పెట్టుకొని ధ్యానము చేయుము." అని బుద్ధుడు ప్రబోధించగా పూజ్యుడైన సోణుడు సమ్మతించెను. అదియే ఆదర్శముగాగొని యితర భిక్షువులనువీడి ఒంటరిగానుండి స్థిరుడై, దీక్షగలవాడై, నిశ్చలుడై జీవితము యొక్క పారమార్థికమును పొందెను. ఎందుకొరకు ప్రపంచములోని ఐశ్వర్యముగల యువకులు తమ ఇండ్లను, వాకిండ్లను, భార్యాబిడ్డలను, అన్ని విధములయిన లాభములను, సౌఖ్యములను, విడిచి, నిలువ నీడలేని నిత్యసంచారులై తిరిగెదరో ఆ ఉత్తమపదమును యీాకంటియెదుట కనుబడు లోకమునందుండగనే యీా సోణుడు సమీాపించి, దాని రహస్యమును గ్రహించి, దానిని ముఖాముఖిని చూచి దాని ఆనందమును అనుభవించి, ఆ ఆనందమున ఓలలాడసాగెను. తనకు తిరిగి పుట్టుక లేదనియు, అధ్యాత్మజీవితము దొరకెననియు, తన జీవిత

కర్తవ్యము నెరవేర్పబడినదనియు, యీదేహము విడిచినపి మ్మట మరల దేహము కలుగదనియు, వర్ణించ నలవిగాని నిర్వాణపదము తాను చేరితిననియు, ఆసోణుడు ప్రత్యక్షాను భవముపొందెను.

అట్లు సోణుడు అర్హతుడై తన యనుభవమును బుద్ధ భగవానుని యెదుట విశదీకరించుటకయి వారిని సమీపించి వారితో వినయ విధేయతలతో యిట్లు మనవి చేసెను. " అర్హతుడయినవానికి యీ ఆరులక్షణములు వికసించును. ౧. త్యాగము, ౨. ఏకాంతవాసమునందలిప్రేమ, 3. హృద యమునందు కరుణ, ౪. కామముయొక్క నాశనము, ౫. తృష్ణానాశనము, ౬. భ్రమనుండి విముక్తి. ఇట్టి సద్గుణ ములు ఆయనయందు ఒప్పుచున్నను, ఒకానొక సోదరుడు వానిని విమర్శింపవచ్చును. కేవలము శ్రద్ధకొరకే యీతడు త్యాగముచేసినాడని అనవచ్చును. కాని యేభిక్షువునియందు ఆసవములెల్లను వేళ్ళతో పెకిలించబడినవో, యెవని జీవి తము పూర్తి అయినదో, యెవనికర్తవ్యము బాకీ లేకుండ నెరవేరినదో వాడు తానింకను చేయవలసినది ఉన్నదని యెంచడు. తాను యిదివరకుచేసిన పనులయొక్క ఫలిత మును అనుభవించవలెనని తలపడు. కామము నశింపబడుట చేతనే, కామము అసలులేకపోవుట చేతనే త్యాగము పుట్టు చున్నది. దుర్బుద్ధి నశించుట చేతనే, ఆ దుర్బుద్ధి అసలు లేక పోవుటచేతనే, ఆయనకు త్యాగము కలుగుచున్నది. భ్రమలు నశించుట చేతనే, అసలు భ్రమలు లేకపోవుటచేతనే, ఆతనికి

త్యాగము కలుగుచున్నది. ఏకాంతవాసము కోరినందుకు యాతడు లాభమును ఆతిథ్యమును, కీర్తిని ప్రతిఫలముగా కోరుచున్నాడని యెవరయినను చెప్పవచ్చును కాని అట్లన జెల్లదు. లాభమునందలి కోరిక నశించుట చేతనే, అసలు అలాభపుకోరిక లేకపోవుటచేతనే, ఆ ఆతిథ్యమునందలి కోరిక నశించుటచేతనే, అట్టి కోరిక అసలే లేకుండుటచేతనే, ఆకీర్తియందలి కోరిక అంతనికి నశించుటచేతనే, ఆకీర్తియందలికోరిక అసలే లేకపోవుటచేతనే, ఆయనకు ఏకాంతవాసమునందలి ప్రేమ ఉదయించుచున్నది. ఈయన హృదయమున కరుణ నెలకొల్పుటకు, కొందరు ఆయన ఇంకను కర్మ జేయవలెనను భావముతో నున్నాడని కారణము చెప్పవచ్చును. కాని యీ కర్మయందలి నమ్మకము (ఆశ్రయము) నశించుట చేతనే ఆయనకు ఆధ్యాత్మికమయిన జీవితమునకు పరమావధియను భావము అసలులేకపోవుటచేతనే యీ అవధూతుని మనస్సు కరుణను పొందుచున్నది. ఇట్లే కామనాశనమును, తృష్ణానాశనమును, భ్రమవిముక్తియు. ఆయన కామము తృష్ణ భ్రమలు సంపూర్ణముగా నశించుటచేతను, ఆసురాది గుణములు అసలేలేకపోవుటచేతను ఈ అవధూతుడు ఉత్తమస్థితి పొందుచున్నాడు. ఎవనిమనస్సు యిట్లు విముక్తి నొందినదో వానికంటియెదుట యేవస్తువులు కనుబడినను, వాని మనస్సును వశపరచుకొనజాలవు. వాని చెవిదగ్గర యేవేవి వినబడినను, వానిముక్కుదగ్గర యేయేవాసనలు కొట్టినను వాని నాలుకదగ్గర యేయే రుచులు పెట్టినను, వాని శరీరమునకు యేయే వస్తువులను

తాకించినను, అవి యేవియు వానిమనస్సును వశపరచుకొన జాలవు. వాని మనస్సు స్థిరమై అచలమై, మాలిన్యరహిత మైయుండి ఆయావస్తువులు పోవు, పోకడలనే ఆయన గమ నించును. చీలికలులేక గట్టిదియై ఒకటే బండగానుండు కొం డపై నాలుగు దిక్కులనుండి వానయు, గాలియు కొట్టు చున్నను, అదిమెట్లువణకక, కదలక, నిలుచునో అట్లే మహా త్ములుకూడా సుస్థిరులై యుందురు. ఇట్టివాడు ప్రపంచ ములోని వస్తువులను, ఇంద్రియముల పోకడలను, ఆ వస్తు వులవల్ల ఇంద్రియములకు కలుగు వేదనలను, గమనించక ముక్తుడై వానియొక్క పర్యవసానమును తెలుసుకొని, కోరడి, కోరకుండెడి, వస్తువులచేత కలతనుబొందక, నిమ్మకు నీరెత్తి నట్లు శాంతవంతుడగును.

ఇట్లు విన్నవించిన సోణునికి, తక్కిన భిక్షువులకును, బుద్ధభగవానుడిట్లు ఉపన్యసించెను. " బుద్ధిమంతులైన యువ కులు ఇట్లు తమ దివ్యజ్ఞానమును వెలువరింతురు. సత్యమును పలుకుదురు. అహంకారము వారలను ఆవరింపదు. ఇట్టి దివ్య జ్ఞానమును పరిహాసముచేయువారు అపజయమును పొందుదురు" అనిచెప్పి సోణుని కరుణించి, " సోణా ! గారాబముతో పెరిగ తివి. ఒంటిఅట్టగల చెప్పులను ధరించుము " అని బుద్ధుడు ఆనతి యిచ్చెను. " ప్రభో ! నేను యిల్లువెడలి ప్రపంచ మును వీడి, భిక్షువును అయినపుడు యెనుబదిబండ్లు మోయు గల బంగారును, ఏడు ఏనుగులు అంభారీలను విడిచివచ్చితిని. ఇట్టివాడే మరల చెప్పులు దొడుగుచున్నాడని అనవచ్చును.

భిక్షుసంఘమున కందరికిని మీార పీలును కలిపించిన యెడల నేను చెప్పులు వాడెదను. సంఘమున కంతకును తాము అనుమతించని యెడల నేను వాడజాలను" అని చెప్పి సోణుడు మన్నింపమని కోరెను. ఆమాటలను విని బుద్ధుడు బౌద్ధసంఘమునకంతకును ఆసౌకర్యమును అనుమతించెను.

......... 

## —§ సింహాయను సేనానాయకుని కథ. §—

—(౧)—

సింహాయనువాడు నిర్గ్రంథుల తెగకు చేరినవాడు. ఈ నిర్గ్రంథులు జైనమతమును స్థాపించిన మహావీరుని శిష్యుల లోని దిగంబరులయిన తెగవారు. ఈ సింహుడు లిచ్ఛవిజాతికి చెందినవాడు. వారు పురమందిరములోచేరి బుద్ధుని పొగడు చుండగా నేను ఈ అర్హ్వతుడయిన బుద్ధుని చూడవలెనని తలంపు ఆతనికి కలిగెను. అంత తనగురువగు, నాతపుమిత్రుని చెంతకు జేరి, "ప్రభో! నేను శ్రమణ గౌతముని చూడదలచెద" నాకు సెలవిండు. అనికోరెను. అందుకాగురువు ఇట్లుచెప్పెను. "సింహా! నీవు క్రియావాదివి. కర్మములకు తగిన ఫలితములు గలుగునని నమ్మెదవు. ఆ గౌతముడో కర్మలకు ఫలము లేద నును. అక్రియావాదము బోధించును. తన శిష్యుల నట్లే తయారుచేయును" ఈమాటలు వినగానే సింహునికి బుద్ధుని చూడవలెనను కోరిక తగ్గిపోయెను. ఇంకొకమారు పుర

మందిరములో మరల బుద్ధుని ఆయన సంఘమును, ధర్మమును పెద్దలు పొగడుచుండగా సీహుడు వినెను. బుద్ధుని చూడ మరల కోరిక పొడమెను. తిరిగి తన గురువునొద్దకు బోయి ఆజ్ఞనిమ్మనెను. మొదటివలెనే గురువు బోధించెను. ఈమారును ఆకోరిక సడలెను. మూడవదిభా మరల పురమందిరములో బుద్ధుని పొగడ్తల వినెను. ఇందలి పెద్దలు ఇన్నిమారులు ఇన్నివిధముల బుద్ధుని పొగడుచుండగా ఆతడు నిజమైన అర్హతుడు అయియుండవచ్చును. ఈ నిగ్రంధులు ఒప్పుకొనినను లేకున్నను వాకేమి? వీని శలవు లేకుండగనే నేను ఆ భగవానుని యేల చూడరాదు? అని సీహుడు నిశ్చయించుకొనెను.

అంత పట్టపగలు ఐదువందల బండ్లుచేసుకొని తమ ముఖ్యపట్టణమగు వేసాలినుండి బయలువెడలెను. బండ్లుసాగినంతవరకు వానిమీద పోయి, అచ్చట దిగి, అంత కాలినడకన బుద్ధునియొద్దకు చేరును. ఆయనకు గవురవముతో నమస్కరించి చెంతనే కూరుచుండి బుద్ధుని ఇట్లు ప్రశ్నించెను. "శ్రమణ గౌతముడు కార్యఫలముల లేవనును. అక్రియను బోధించును. అందులో శిష్యుల తయారుచేయును" అనివింటిని. "ప్రభో! అట్లు చెప్పెడి వారుమిమ్మునుగూర్చి సత్యముచెప్పుచున్నారా? మీపై అబద్ధపుసాక్ష్యము చెపచున్నారా? మీధర్మమునకు బదులు దొంగధర్మమును మీపై అంటగట్టుచున్నారా? భగవంతునిపై అబద్ధములను ఆరోపించకుండునటుల చేయుటయే

నాయుద్దేశ్యము. ధర్మవిషయమై యిట్టి సంభాషణ చేయుటలో లోపము వుండదు. కానసత్యాసత్యములను తెలవిండు."

"సీహా! శ్రమణగౌతముడు కార్యవాదమును నిరాకరించును. అక్రియావాదమును బోధించును. తన శిష్యుల సందులో తయారుజేయును. అ చెప్పుటలో కొంతనిజమున్నది. సీహా శ్రమణగౌతముడు క్రియావాదమును నిలువబెట్టును. దానినే శిష్యులకు బోధించును. దానిలోనే శిష్యుల తయారుజేయును, అని చెప్పుటలోను కొంత నిజము గలదు. మరల సీహా! శ్రమణగౌతముడు ఉచ్ఛేదవాదము (నిర్మూలవాదము)ను నిలబెట్టును. దానిని బోధించును. దానిలో శిష్యులను తయారుచేయును. అని చెప్పుటలోను నిజముకలదు. సీహా! శ్రమణగౌతముడు జిగుప్సతను ( దూష్యభావము ) ప్రకటించును. దానిని బోధించును. దానిలో శిష్యుల తయారుజేయును.అని చెప్పుటలోను కొంత నిజము గలదు. సీహా! శ్రమణగౌతముడు వినయమును, సత్ప్రవర్తన ప్రకటించును. దానినే బోధించును. దానిలో శిష్యుల తయారు జేయును. అనిచెప్పుటలోనుకొంత నిజము గలదు. సీహా! శ్రమణగౌతముడు తపస్సును అపగర్భత ( పుట్టుకలేకపోవుట ) ఆత్మవిశ్వాసము ప్రకటించును. బోధించును. వీనిలో శిష్యుల తయారుజేయును. అని చెప్పుటలో కొంత కొంత సత్యము గలదు. పైనజెప్పిన హంశములలో యెట్లుయెట్లు యెతెంత సత్యములిమిడియున్నవో వివరించెద వినుము.

సీహః యను సేనానాయకుని క

సీహః! మనస్సుచేతను, వాక్కుచేతను, క్రియచేతను వీనిలో వేనిచేతను, అధర్మమైన కార్యములను చేయవలదు అందును. మంచివిగానివియు, చెడుగయినవియు అగు హృదయపరిస్థితులను కల్పించవలదు అందును. నేను అక్రియావాదినననపుడు వున్న నిజమిదియే. మరల మనస్సు, వాక్కు, క్రియలచేత ధర్మమైన పనులను చేయమందును. చెడుగు గానివియు, మంచివైనవియు, అగు హృదయపరిస్థితులు కల్పించమందును. నేను క్రియావాది నననపుడు వున్న నిజమిదియే.

సీహః! కామమును, దుష్టఇచ్ఛలను, దుర్భ్రమలను వీనికిఅనుకూలమయిన హృదయపరిస్థితులను కుంకుటివేళ్ళతో పెల్లగించివేయమందును. నేను నిర్మూలనవాదిననగా వున్న నిజమిదియే. మనస్సు, వాక్కు, క్రియలచేత అధర్మకార్యములయందు అసహ్యమును కల్పింతును. అట్టి హృదయపరిస్థితులు అసహ్యమని ప్రకటింతును. నేనుచేయు దూష్యవాదములోని నిజమిదియే. కామమును దుష్టయిచ్ఛలను, దుర్భ్రమలను దూరముచేయుటకు అవసరమయిన సాధనమును దానికి అనుకూలమగు పరిస్థితులు నిలువబెట్టుటకు మార్గమును జూపెదను. నేను వినయబోధకుడననగా వున్న నిజమిదియే. మనస్సు, వాక్కు, క్రియలయందుగల అధర్మములను అట్టి అధర్మపరిస్థితులను మొదలంట కాల్చివేయమందును. నేను తపోవాదిననగా వున్న నిజమిదియే. ఎవని హృదయములో నయినను దుష్టత్వము మొదలంట నరికి నిప్పులోవేసి కాల్చి మరల పుట్టుటకు వీలులేనట్లుగా పదునుచేయుటయే నిజమైన

తపస్సు. తిరిగితల్లికడుపులో పుట్టుఅవసరములేకుండ యితరదేహములుపొందకుండ దానికారణములను మొదలంట వారికి తృష్ణల పెరుగకుండ చేయుటయే నేనుఅపకర్మవాదిననగాయున్న నిజము.

సీహా! నాకు అత్యున్నతమైన ఆత్మవిశ్వాసముగలదు. నాశిష్యులకందరకు అదియే బోధించెద. వారలతృప్తిచేసెద. నేను విశ్వాసవాది ననగా అందులోవున్న నిజమిదియే.

ఈవాక్యములను వినిన సీహాకు ఒడలు వుప్పొంగెను. అనేకవిధముల బుద్ధుని పొగడెను. నన్ను నీ శిష్యునిగా నెంటనే గ్రహించుమని వేడుకొనెను. సీహా! నీవు చేయదలచిన పనిని ముందుగా యోజించుకొనుము. నీవంటి ప్రముఖులు తగిన ఆలోచనలేనిది యేపని చేయుట భావ్యముకాదు. అని బుద్ధుడు వానికి బదులుచెప్పెను. ఆమాటలువినగానే సీహుడు “ఓప్రభో! నా ఆనందమును భగవానునియందు నావిశ్వాసమును మీ యీ మాటలవలన మరింత పెరిగిపోవుచున్నది. ఇతర గురువుల నెవరినయినను నన్ను మీశిష్యునిగా జేర్చుకొనమని నేను కోరినయెడల వారు పొంగి, గెలుపుజెండాల నెత్తి, వేసారి పట్టణముననెల్ల ప్రకటించి యుందురు. కాని తాము అట్లుచేయక మరల యోజించుకొనమని నాకు బోధించుచున్నారు. నేను యింకొకపర్యాయము వేడెద. నన్ను మీశిష్యునిగా జేర్చుకొనుడు.” అంత బుద్ధుడు సీహాను పిలచి “సీహా! అనేకదినములనుండి నీ యింటిలో నిర్గ్రంథులకు అన్నపానము లిచ్చుచుంటివి. ఇక ముందు వారు నీయింటికి భిక్షకు వచ్చినయెడల వారికి మామూలుగా అన్నపానము

లిచ్చుటయే న్యాయమని నీవు గ్రహించవలెను" అని బుద్ధుడు ప్రబోధించెను. ఈమాటలు వినుచుండ సీహాకు మితి మీరిన ఆనందము, విశ్వాసము కలిగెను. "బుద్ధప్రభో మిమ్ము గూర్చి యితరులు యెట్లు చెప్పుకొనుచున్నారో వినుడు. "శ్రవణగౌతముడు, తనకును, తన శిష్యులకును మాత్రమే దానములు చేయుమనును. ఇతరగురువులకును, వారి శిష్యుల కును దానములు చేయకూడదనును. తనకును, తన శిష్యుల కును యిచ్చిన దానములవలననే పెద్ద ఫలముగలదనియు, ఇత రుల కిచ్చినదానివలన ఆవంతయు ఫలములేదనియు, శ్రవణ గౌతముడు అనును. ఇట్లు లోకులు ఆడు పలుకులకు భిన్న ముగా నిగ్రంధులకుకూడ భిక్షపెట్టుమని నాకు మీరు ఆనతి యిచ్చుచున్నారు. వారు వచ్చినపుడు యోచించెదను. మూ డవమారు వేడుకొనెద. నన్ను మీ శిష్యునిగాచేర్చుకొనుడు" అంతట బుద్ధుడు ఆసీహానకు ధర్మతత్వమునుగూర్చి విపుల ముగా బోధించెను. గృహస్థశిష్యునిగానంగీకరించెను. సీహుడు బుద్ధుని, బుద్ధసంఘమును, మరునాడు భిక్షకు పిలిచెను. బుద్ధుడు అంగీకరించెను.

మరునాడు సీహుడు చక్కని భోజనపదార్థముల నేర్ప రచెను. నిగ్రంధులు కొందరు, నేడుశ్రమణగౌతముని భిక్షకై సీహాసేనాని పెద్దయెద్దును చంపి భిక్షచేయుచున్నాడు. ఎరిగి యెరిగి గౌతముడు భోజనము చేయుచున్నాడు. ఈజీవహత్యాకు కారకుడు ఆతడేయని వేసాలిలో నలువైపుల ప్రకటించిరి. ఈకబురు సీహాకు తెలిసెను. "దానిని లక్ష్యపెట్టకుము. బుద్ధుని

ధర్మమును, సంఘమును అపఖ్యాతిపాలు సేయుటకు పూజ్యు లయిన యీ నిగ్రంథిసోదరులు చాలకాలమునుండి యత్నించుచున్నారు. వ్యర్థమైన అబద్ధములను భగవానునిగూర్చి చెప్పుటకు వారు విసువుచెందకున్నారు. మాప్రాణముల మీదికి వచ్చినదు యెరిగియుండి మేమొక జీవినయిన చంపెదమా?” అని సీహుడు బదులు చెప్పెను. వేళకాగానే బుద్ధుడును, బుద్ధసంఘమును, భిక్షుకు వచ్చిరి. సీహుడు తానే వారికి తగు ఉపచారములుచేసి తన చేతులతో వడ్డించెను. వారందరు భిక్ష గైకొనిరి.

......... 

## —జీవకకుమారబచ్యునికథ.—

—(౦)—

వేసాలినగరములో ఆదినములలో యేడువేల యేడువందలయేడు మేడలును, యేడువేలయేడువందలయేడుగోపురములుగల ఇండ్లును, యేడువేలయేడువందలయేడు ఆట తోటలును, యేడువేల యేడువందలయేడు తామర కొలనులును గలవు. అందకత్తెయైన అంబపాలిక యనువేశ్య గలదు. నాట్యము, సంగీతము, గాత్రము, వీణె పాటలలో మెప్పొందిన నేర్పరి. ఆమె ఒక్కొక్కరాత్రికి యేబదినవర్సులు పుచ్చుకొనుచుండెడిది. ఆమెవలన వేసాలినగరముమరింత సంపదతో తులదూగుచుండెను. మగధరాజధానియగు రాజగృహము (లేక గిరివ్రజము) పట్టణమునుండి పనిమీదవచ్చిన వర్తకుడు వేసాలినగరమును జూచి ముచ్చటపడి తానుఇంటికిబోయి

తన రాజు బింబిసారునితో ఇరా వేసాలనగరి వార్తలు చెప్పెను. వారు ఉభయులును యోచించి రాజగృహనగరమున అంబ పాలికను మించిన శాలావతియను నొకవేశ్యను నిల్పిరి. అంత మంత నేర్పరియైన రాత్రికిని నూరు పనసులు తీసుకొనుచుండెను. కొన్నాళ్ళలో యీశాలావతి గర్భవతి ఆయెను. ఈ వార్త బైటపడిన యెడల తన వృత్తిపోవును అని ఆమె తాను జబ్బుగా నున్నది అని ప్రకటింపచేసెను. ఇంతలో నెలలు నిండి ఒక బాలుని గనెను. తట్టలో బెట్టి తీసుకొనిపోయి పెంటదిబ్బమీద పార వెయ్యుమని తన దాసికి ఆజ్ఞాపించ అది అట్లు చేసెను. ఆ దోవను పోవు అభయుడను రాజకుమారుడు అచటనున్నగ్రద్దలను, కాకులనుజూచి, చేరిన ప్రజలను యిది యేమియని యడి గెను. ఒక మగపిల్లవాడు ప్రాణముతో నిట పడి యున్నాడు అని వారు చెప్పిరి. మహారాజకుమారునకు తెచ్చి దాదులకు ఒప్ప గించవలసినది. వారు పోషింతురు అని చెప్పగా ఆప్రజలు ఆబాలుని యెత్తుకొనిపోయి ఆదాదులకు వప్పగించిరి. ప్రాణ ముతో వుండిన బాలుడు గనుక జీవకుడనియు, రాజకుమా రునిచేత పెంచబడినందున కుమారబచ్ఛ్యాయనియు పేర్లిడిరి.

కొన్నియేండ్లకు యీజీవకకుమారబచ్ఛ్య యుక్తవయ స్కుడు ఆయెను. ఈతడు అభయుని సమీపించి, "యువ రాజా! నాతలిదండ్రులు యెవరు?" అని అడిగెను. అంతట "జీవకా! నీతల్లి యెవరో నేనెరుగ. నేను నిన్ను పోషిం చితిని గనుక నేనే నీ తండ్రిని" అని అభయుడు జవాబు చెప్పెను. అంత జీవకుడు యేదయినను ఒక వృత్తి నేర్చు

కొనక యీ రాజకుటుంబములో జీవించుట కష్టము. అని యోచించి అభయునితో చెప్పక బయలుదేరి అచ్చటచ్చట తిరిగి చిట్టచివరకు తక్షశిలానగరము చేరెను. అచ్చట అప్పుడు లోకప్రఖ్యాతిగల వైద్యుడు ఉండెను. వానిని సమీపించి నాకు వైద్యము నేర్పుమని కోరెను. మిత్రమా! జీవకా! అట్లే నేర్పుకొమ్మని సెలవిచ్చెను. జీవకుడు అక్కడ యేడు సంవత్సరములు నేర్చుకొనెను. నీవు చురుకైనవాడవు తెలివిగా గ్రహింతువు. గ్రహించినది మరచిపోవు. ఏడుసంవత్సరములు అయినప్పటికి యీ విద్య యొక్కటి పూర్తికాదు అని అనుకొని తన గురువును " నేను యింకా యెన్నాళ్ళు చదువవలెను " అని యడిగెను. నాప్రియమయిన జీవకా! యీ గునపము తీసుకొనిపోయి యీ తక్షశిలానగరము చుట్టును అన్నివైపులను ఒక్క-యోజనము (యెనిమిది మైళ్ళు) వరకును వెదకిచూచి మందుకు పనికిరాని మొక్క యున్న యెడల నాకు తెచ్చి చూపుము అని వైద్యుడాజ్ఞాపించెను. ఆప్రకారమే జీవకుడు అన్నివైపుల తిరిగి తిరిగి, మందుకు పనికిరాని మొక్క యొక్కటి లేక ఆసంగతి గురువునకు మనవిచేసెను. నీచదువు పూర్తిఅయినది. జీవనోపాధి సంపాదించుకొనుటకు యిది చాలును అని చెప్పి జీవకుని యింటికి బంపెను. దారి బత్తెము క్రింద కొంత ధనము కూడ యిచ్చెను.

సాకేతపురి చేరువరకు గురువిచ్చిన పైకము ఖర్చు అయ్యెను. ముందుముందుదోవలు అడవిదోవలు. నీరు, అన్నము దొరకుట కష్టము. పైకము లేనిది పోజాలను. ఇచ్చట కొంత

ధనమును సంపాదించుటకుంచిదని జీవకునకుతోచెను. సాకేతపురిలోని పెద్దశ్రేష్ఠిభార్య యేడుసంవత్సరములనుండి తలనొప్పితో బాధపడుచుండెను. వైద్యులనేకులు మందుల నిచ్చిరి. కట్నములు పుచ్చుకొని వెడలిపోయిరి. కాని ఆమెకు [illegible] లేదు. ఈసంగతి తెలుసుకొని జీవకుడు వారి యింటికి పోయెను. అచ్చటికి బోయి నేను వైద్యుడననియు, శ్రేష్ఠిగారి భార్యను చూతుననియు, అచ్చట కాపలావానిని (ద్వారపాలకుని) ద్వారా లోపలికి కబురు చేసెను. వాడు ఆ సంగతి శ్రేష్ఠిగారి భార్యకు చెప్పెను. ఆమె ప్రశ్నించగా ఈ క్రొత్తవైద్యుడు యువకుడు అని తెలియచేసెను. వృద్ధులును, ప్రఖ్యాతులును అయిన వైద్యులు చేయలేని పనిని వీని వలన కానేరదు. కాన పొమ్మని చెప్పుము. అని ఆమె ఆజ్ఞాపించెను. అదివిని జీవకుడు యిట్లు చెప్పెను. "ముందుగా నేమియు నియ్యనక్కరలేదు. నామందు పుచ్చుకొని నయమయిన మొదల తోచినది యియ్యవచ్చును." అని జీవకుడు మరల కబురు పంపెను. ఈమాటలువిని జీవకుని ఆమె పిలిపించెను. అంతట అతడు ఆమె ముఖవైఖరిని చూచి రోగమును నిర్ణయించుకొని కొన్ని వస్తువుల తెప్పించి మందు తయారుచేసి వెల్లికిల పరుండబెట్టి ముక్కులోగుండ ఔషధము నిచ్చెను. ఆమె దానిని పుచ్చుకొని నోటినుండి కక్కెను. అది అచ్చట పళ్లెములో పడెను. దూదితెచ్చి యీనేతిని ఒకగిన్నెలోకి నెత్తుమని ఆమె తన దాసితో చెప్పెను. ఈమె యింతలోభి. దీనితో యేమిచేయును. నాకేమి బహుమతినిచ్చునని జీవకుడు సందే

హించెను. ఆమె, జీవకుని మొగము చూచి ఆభావమును గనిపెట్టి ప్రశ్నించెను. జీవకుడు వస్తునిజము చెప్పెను. ఆమె యీనేతితో నొకళ్లు కాళ్ళు రుద్దుకొనుటకుగాని, దీపము పెట్టుకొనుటకుగాని, ఉపయోగపడును. గృహస్థులకు పొదుపుండవలెను. నీవు అనుమానించవద్దు. నీబహుమతి తప్పక నిచ్చెదను. అని ఆమె చెప్పెను. ఆమందుతోనే ఆమెకు నయమయ్యెను. ఆమె నాలుగువేల సవర్నులు జీవకునికి కట్నముగా నిచ్చెను. తల్లికి నయమైనదని సంతోషముతో ఆమె కుమారుడు నాలుగువేల సవర్నుల నిచ్చెను. అత్తగారికి రోగము నెమ్మదించెనని కోడలు మరినాలుగువేల సవర్నులును, భార్యకు కుదిరినదని ఆశ్రేష్ఠి ఇంకొక నాలుగువేల సవర్నులును, ఒక గుర్రపుబండిని, ఒక దాసుని, దాసిని యిచ్చెను. వీనితో జీవకుడు పయనమయి కొన్నిరోజులలో రాజగృహముచేరెను.

తనను పెంచిన అభయకుమారుని యొద్దకుబోయి సమస్కరించి తాను సంపాదించిన సంపదనుచూపి, వారికి అర్పించెను. "నన్ను ప్రేమతో పెంచినవారలకు నాకృతజ్ఞతను తెలుపు కట్నముగా దీనిని గైకొనుడు" అని జీవకుడు కోరెను. "జీవకా! దానిని నీవేయుంచుకొనుము. మాదేవిడీని వదలక అందులోనే ఒక యిల్లు కట్టుకొనుము." అని అభయుడు శెలవియ్యగా జీవకుడు అట్లేచేసెను. ఆకాలమున బింబిసారునికి ఆసనమువద్ద కురుపులేచిబట్టలు నెత్తురు అగుచుండెను. ఆయన భార్యలు మీరుగూడ బయటనున్నారు. ఇక గర్భవతులు అగుదురు అని ఆయనను పరిహాసించిరి. ఆయన చింతిల్లి అభ

యునితో చెప్పుకొనెను. అభయుడు జీవకుని పిలచెను. జీవకుడు తన వ్రేలిగోటిమీద మందు తీసికొనిపోయిఆకురుపునకు ఒక్కపూత పూసెను. దానితో రాజునకు నయమయ్యెను. ఆయన సంతసించి తన రాణులు అయిదునందలమందిని వారికి వున్ననగలన్ని పెట్టుకొని, ఆయావత్తుసొమ్మును జీవకునికి విలువు దోపు యిమ్మని చెప్పెను. రాణులు అట్లు చేయబూనిరి. జీవకుడు దానికి సమ్మతించక తనను రాజవైద్యునిగా చేసిన చాలునని మనవి చేసెను. రాజకుటుంబమునకును, భిక్షుసంఘమునకును, ఇంటివైద్యునిగా జీవకుని బింబిసారుడు నియమించెను.

ఆనగరములోని పెద్దశ్రేష్టికి యేడుసంవత్సరములనుండి తలలో బాధకలిగి అనేకములయిన మందులు పుచ్చుకుని విసిగిపోయెను. కొందరు వైద్యులు యీతడు అయిదవరోజునను, మరికొందరు యేడవరోజునను, చనిపోవునని చెప్పిరి. ఆపట్టణములోని యితర వర్తకులు సంప్రదించుకొని రాజును వేడుకొని ఆయన అనుమతిమీద జీవకుని తీసుకొనిపోయిరి. జీవకుడు ఆరోగిని చూచి నీకు నయమైన యెడల నాకే మిత్తువని అడిగెను. "నా ఆస్థిసంతయు నీకిచ్చి నేను నీకు బానిసనగుదు" నని చెప్పెను. ఏడు నెలలవరకు కదలకుండ ఒకప్రక్కను, తరువాత యేడు నెలలవరకు కదలకకుండా రెండవ ప్రక్కను, పిమ్మట యేడు నెలలవరకు కదలకుండ వెల్లకిలను, పండుకొందువాయని జీవకు డడుగ, రోగి సరేననెను. అంత జీవకుడు వానిని పరుపుమీద పరుండబెట్టి, కాళ్ళు

చేతులు గట్టిగా మంచమునకుకట్టి, తలపైనతోలును కత్తిరించి, రెండువైపులనుండి రెండు పురుగులను బయటికి తీసెను. అందులో ఒకటి పెద్దదియు, ఒకటి చిన్నదియు. పెద్దదానిని చూచిన వైద్యులు అది మెదడులో ప్రవేశించుటకు అయిదు రోజులు పట్టునని అంచనావేసిరి. చిన్నదానిని చూచిన వారు యేడురోజులు పట్టునని అంచనావేసిరి. అని తెలిపి ఆతోలును కుట్టి మందురాచెను. ఆరోగి యేడేసిరోజులు మాత్రమే రెండు ప్రక్కలను వెల్లకిలను పరుండెను. జీవకుడు అది చాలునని చెప్పెను. (ఇప్పటికిని శస్త్రముచేసిన యెడల వైద్యులు మూడువారములు విశ్రాంతిని విధింతురు.) అంతట ఆరోగి ఆరోగ్యవంతుడయి తాను చెప్పినప్రకారము కట్నము యిచ్చుటకు సిద్ధమయ్యెను. జీవకుడు అంతకట్నము యియ్యవద్దనిచెప్పి తాను ఒక లక్ష సవరసులను తీసుకొని రాజుకోశమునకు మరియొక లక్ష శౌరులనిచ్చునట్లు చేసెను.

ఆసమయమున నే కాశీపట్టణములోని పెద్దశ్రేష్టి కుమారుడు మొగ్గలు వేయుచుండగా కడుపులోని పేగులు మెలియబడి అన్నపానములు తీసుకొనవీలులేకపోయెను. ఆశ్రేష్టి జీవకుని ఖ్యాతివిని రాజు సమ్మతిమీద జీవకుని కాశీకితీసుకొనిపోయెను. జీవకుడు ఆరోగినిచూచి అతని అచ్చట నొక స్తంభమునకు అంటకట్టి కడుపుకోసి మెలియబడిన పేగులను తీసి ఆతని భార్యకు చూపి, మెలివిప్పి సరిచేసి, లోపల నమర్చి పైకుట్టుకుట్టి మందువేసెను. దానికి పదహారువేల నవ

రుసుల బహుమతిపొంది జీవకుడు రాజగృహమునకు తిరిగి వచ్చెను.

ఆకాలమున ఉజ్జయిని నగరమును ప్రద్యోతుడను రాజు పాలించు చుండెను. వాని కండ్లు పసికరలై యెన్ని మందులు తినినను, యెంతడబ్బు ఖర్చుపెట్టినను, నయము కాదాయెను. అంతట ఆరాజు బింబిసారునికి కబురుచేసెను. అతను జీవకుని పంపెను. జీవకుడు ఉజ్జయిని నగరముచేరి రాజునుచూచి కాచిన నెయ్యి పుచ్చుకొనవలెనని చెప్పెను కాని రాజునకు నెయ్యిఅనిన ద్వేషము. వేరేయొక మందునిమ్మని కోరెను. అంతట జీవకుడు నెయ్యిలేనిది యీరోగమునయము కాదు. యేరూపమున నైనను నెయ్యి యివ్వవలెను. దాని రంగు, వాసన, రుచి మారునట్లు కషాయముచేసి ఇచ్చెదనని ఆలోచించి ఆప్రకారమే జరిపెను. రాజు దానినిపుచ్చుకొనెను. కానిజీవకుడుమాత్రము ఈమందు అరుగునపుడు రాజుకు కక్కు వచ్చును. అపుడు నెయ్యియిచ్చితినని కనుగొనును. ఈరాజు క్రూరుడు. నన్ను అప్పుడు చంపివేయును. ఈతనికి ఇది జీర్ణ మగు లోపలనే వెళ్ళిపోవలెను. అని ఆలోచించుకొనెను. అంతట రాజుతో మేమిట్టివేళ కొన్ని ఓషధులను, మూలికలను, సంపాదించవలెను. మీవాహనములలో నొకదానినిప్పించుడు. ఇష్టమైన నగరద్వారమున వెళ్లుటకు అనుజ్ఞనిండు. అనిచెప్పెను. రాజు అట్లే ఉత్తరువులు జారీచేయించెను. రోజుకు యేబది యోజనముల చొప్పున నడువగల భద్రవటియను నేనుగ నెక్కి జీవకుడు తప్పించుకొని పోయెను. కొంతసేపటికి

ప్రద్యోతునికి డోకువచ్చి నెయ్యి కక్కెను. అంత జీవకుని మీద మండిపడి, వానిని పిలువమనెను. వాడు అంతకుముందే పేయేనుగుమీద యెక్కిపోయినట్లు పరివారము చెప్పిరి. తన భానిసయగు కాకాను పిలిచి నీవుపోయి జీవకుని పట్టుకొని రమ్మని చెప్పెను. ఈకాకా అరువది యోజనములు నడువగల వాడు. వాడు జీవకుని కోశాంబి యను నగరములో కలసెను. జీవకుని తిరిగి రమ్మనెను. జీవకుడు తాను భోజనముచేయుచు కాకా నీవుకూడా భోజనము చేయుము. అని చెప్పెను. కాని కాకా తినడయ్యె. ఈ వైద్యులు తాంత్రికులు. వారు ఇచ్చు నది తినవద్దని రాజు యంతకు ముందే యాతనితో చెప్పి యుండెను. జీవకుడు తాను యప్పుడు ఒకపండుతిని నీరు త్రాగుచుండెను. జీవకుడు తన గోటితో నొక మందును తీసి ఆపండులో గలిపి ఆపండును, నీటిని కాకాకు ఇచ్చెను. వైద్యుడు తినుచున్నది, త్రాగుచున్నది తనకిచ్చుచుండుట, ఇందులో మోసము ఉండదని యెంచి కాకా దానిని పుచ్చుకొనెను. అంతట వానికి విరోచనములు కాసాగెను. అదిచూచి భయపడి, జీవకా నాకుజీవదానము చేయుమని కాకా వేడుకొనెను. కాకా నీవు భయపడవద్దు. నీకు నయముచేసెదను. మీరాజు క్రూరుడు. నేను తిరిగి వచ్చిన నన్ను చంపును యని జీవకుడు చెప్పి కాకాకు కుదిర్చి భద్రావతి యేనుగును తిరిగి ఇచ్చి కాకాను పంపివేసి తాను రాజగృహనగరముచేరెను. అచ్చట ప్రద్యోతనునికి నెమ్మదించెను. ఆతడు, జీవకుని పిలిపించి బహుమతి చేయనెంచి జీవకునకు కబురు చేసెను. కాని జీవకుడు

రాడాయెను. తనకు కష్టము వలదనియు రాజు తననుజ్ఞాపక ముంచుకొనిన చాలుననియు, కబురుచేసెను. ప్రద్యోత నుడు దానితో తృప్తినొందక తనయొద్దనున్న మిక్కిలి విలువ గల మిక్కిలిసన్ననయిన ఉత్తమోత్తమమయిన శిబిదేశములో తయారయినవస్త్రములను కానుకగా జీవకునకు బంపెను. జీవకుడు దానిని జూచి ముచ్చటబడి యీయది బుద్ధభగవా నుడయినను లేక బింబిసారుడయినను ధరింపవలెనని యెంచి వారికి అర్పించుటకు వేచియుండెను.

బుద్ధభగవానుని కొంకపర్యాయము జబ్బు చేసెను. ఆనందుడను శిష్యుడు జీవకుని పిలిపించెను. జీవకుడు బుద్ధుని చూచి కొన్నాళ్లు ఆయన వొంటిని తైలముతో మర్దించవలె నని చెప్పెను. ఆనందుడు అట్లు చేసెను. అంతట జీవకుడు మూడు గుప్పిళ్ల నీలతామరపుష్పములను తెచ్చి వానికి కొన్ని మందులు రాసి బుద్ధునికి చూపించి యిట్లు చెప్పెను. ఈ ఒక గుప్పెడు ఒకపర్యాయము వాసన చూచిన యెడల పది విరో చనములగును. మూడుగుప్పెళ్ళు వాసన చూచిన యెడల ముప్పది విరోచనములు అగును. దానితో మీశరీరము బాగు పడును. అని విన్నవించి బుద్ధునికి ప్రదక్షిణముచేసి జీవకుడు వెడలిపోయెను. పోవుచుండగా యిరువైతొమ్మిది విరోచన ములగుననియు, అంతట వేడినీళ్ళ స్నానముచేయవలెననియు పిమ్మట ముప్పదవ విరోచన మగుననియు తోచెను. వెంటనే జీవకుడు తిరిగివచ్చి ఆసంగతిని బుద్ధునితో చెప్పెను. వారట్లు చేసిరి. పిమ్మట కొన్ని దినములవరకు ద్రవపదార్థములేవియు,

తినరాదని పథ్యము పెట్టెను. కొలది దినములలో బుద్ధునికి నెమ్మదించెను. ఒకనాడు జీవకుడు ఉజ్జయినిరాజు తనకు యిచ్చిన బట్టలు తెచ్చి బుద్ధుని తనకొకవరమిమ్మని యడిగెను. కోరినకోరిక తెలియనిది వరమియ్య వీలులేదని బుద్ధుడు శెలవిచ్చెను. ఇందులో దోషములేదని జీవకుడు మనవిచేయగా బుద్ధుడు సమ్మతించెను. అప్పుడు జీవకుడు తాదెచ్చిన బట్టను బుద్ధునికి సమర్పించెను. బుద్ధుడు దానిని స్వీకరించి ధర్మమును బోధించి అతని మనస్సును వికశించునట్లు జేసెను. అప్పటికి బుద్ధుడు బోధ మొదలుపెట్టి యిరువై సంవత్సరములుఅయ్యెను. అని బుద్ధఘోషుడను చరిత్రకారుడు తెలిపియుండెను.

భిక్షువులలో కొంతమంది తీపివస్తువులను యెక్కువగా తినుటవల్ల వేసాలి నగరములో జబ్బుపడిరి. అచ్చటకి జీవకుడు యితర పనిమీద వెళ్ళియుండెను. ఆభిక్షువులనుచూచి వారి జాడ్యములను గ్రహించి, వారు కొంత వ్యాయామము తీసికొనవలయుననియు, ఆవిరిస్నానములుచేయవలయుననియు యేర్పరచెను. బుద్ధభగవానునితో మాట్లాడెను. వారు భిక్షువులు పచారుచేయుటకు చంకములును, (దారులు) ఆవిరిస్నానములు చేయుటకు జంత్రాగృహములను నిర్మింప అనుజ్ఞనిచ్చెను.

ఆకాలములో మగధరాజ్యములోని ప్రజలకు అయిదు జాడ్యములుండెను. కురుపులు, మూర్ఛలు, క్షయ, తడికుష్టు, పొడికుష్టు అనునవే ఆ అయిదు జాడ్యములు. ఇట్టి రోగములుగలవారు భిక్షుసంఘములో చేరుచుండిరి. అట్లు

చేరినవారికి జీవకుడు ఉచితముగా ఔషధమిచ్చి త్వరగా నయముచేయుచుండెను. భిక్షువులు ఆరోగులకు ప్రేమతో ఉపచారములు చేయుచుండెడివారు. రాజు గృహస్థులగావు లోని పౌరులు గావలసిన వస్తువులను అర్పించుచుండిరి. ఈ సందును కనుపెట్టి మోక్షముకొరకుగాక, యీ రోగమును కుదుర్చుకొనుటకే కొందరు భిక్షువులుగా జొచ్చిరి. అందులో నొకడు తనరోగము కుదిరినపిమ్మట భిక్షుసంఘమును వీడి కాషాయమును పారవేసి, తిరిగి సంసారములో ప్రవేశించెను. వాని నొకమారు జీవకుడు చూచెను. నీవు సంఘములో చేరితివిగదా? ఇప్పుడు యిట్లు వున్నావేమని అడిగెను. వాడు జీవకునకు ఉన్నది ఉన్నట్లు చెప్పెను. అంత జీవకుడు ఆ వార్త బుద్ధున కెరింగించెను. బుద్ధుడు తగిన కట్టుదిట్టముల నేర్పరచెను.

... ... ...

## —౯ వి శా ఖ క థ. ౯—

—(౦)—

విశాఖామి గారమాత అని ఈమె పూర్తిపేరు. ఈమె కుమారుడు మిగారుడును, ఈమె మనుమడును, ఇద్దరు భిక్షువులయిరి. ఈమె గృహస్థాశ్రమములోనుండి ఉపాసకురాలుగా నుండెను. ఈమె మనుమని దీక్షపొందుమని వర్షాకాలములో చాతుర్మాస్యలలో భిక్షుసంఘము వద్దకు బంపెను. శ్రావస్తి నగరములోనున్న ఆభిక్షువులు వర్షాకాలములో దీక్షనివ్వకూడ

డని తలచి యీామె మనుమని త్రిప్పిపంపిరి. ఈసమాచారము బుద్ధునికి తెలిసి వారు కాలనీమము లేకుండ అందరికి దీక్ష యివ్వవచ్చునని శాసించిరి.

శ్రావస్థీనగరములో బుద్ధుడు వుండగా విశాఖ ఒకనాడు బుద్ధుని భిక్షుసంఘమును భిక్షకు పిలచెను. బుద్ధుడు అంగీకరించెను. ఆమె ఆరాత్రియు, మరునాడును కావలసిన వంటలు తయారు చేయించెను. ఆరాత్రి పెద్దవాన కురిసెను. బుద్ధుడు ఆవానలో స్నానము చేయుడని అందరికిని సలహాచెప్పెను. వారు తమ బట్టలను విడిచి మొండిమొలలతో స్నానము చేయుచుండిరి. వంటలు కాగానే విశాఖవీరిని పిలుచుటకై తనదానిసను పంపెను. ఆచిన్నది వచ్చిచూచునప్పటికి వీరు దిగంబరులుగా నుండిరి. వీరు భిక్షువులు గారనియు, నిర్గ్రంధులనియు, ఆయమ తలచి యింటికిబోయి ఆరామములో భిక్షువులు లేరని విశాఖతో చెప్పెను. విశాఖ తెలివిగలది. కాని తన నౌకరు పొరబడిన పొరబాటును గ్రహించి ఆతోటకే మరల తన నౌకరును పంపెను. ఆతోటకుబోయి అచ్చట నున్నవారితో వంట అయినది దయచేయుడు అని చెప్పుమనెను. ఈకన్యక వెళ్ళునప్పటికి భిక్షువులు స్నానములు చాలించి వళ్ళు తుడుచుకొని తమ తమ గదులలోనుండిరి. కాన ఆమెకు భిక్షువులు యెవరును కనుబడలేదు. ఆపిల్ల తిరిగివచ్చి తోటలో యెవరులేరని చెప్పెను. విశాఖ మొదటవారు మొండిమొలలతో స్నానము చేయుచుండినట్లు ఊహించినట్లే యిప్పుడువారు స్నానము అయినపిమ్మట గదులలో నుందురని ఊహించెను, తాను తిరిగి

నౌకరును పంపెను. ఆమెవచ్చి కబురు చెప్పగానే బుద్ధుడును భిక్షువులును బయలుదేరి విశాఖయింటికి జని ఆమె సమర్పించిన భిక్షను అంగీకరించిరి. బుద్ధుడు ఆమెకు బోధించెను. ఆమె బుద్ధుని సమీపించి కూర్చుని తనకు యెనిమదివరములు యిమ్మని వేడుకొనెను. "మీకోరిక తెలియజేయకుండ అడిగినయెడల తథాగతులు అంగీకరించరు" అని బుద్ధుడు జవాబు చెప్పగా నాకోరికలు సవ్యమైనవి, ఆక్షేపణ పుంపనేరవు. అని ఆమె బుద్ధునికి మనవిచేసెను. అంతటబుద్ధుడు నీకోరికను తెలుపుమని ఆజ్ఞాపించెను.

భిక్షు సంఘమునకు వానకాలమందు కావలసిన బట్టలను శ్రావస్థికి వచ్చెడి భిక్షువులకు అన్నమును, శ్రావస్థనుండి పోవువారికి అన్నమును, రోగులకు అన్నమును, రోగులపై సేవ జేయువారికి అన్నమును, రోగులకు మందును ఎడతెగకుండ సంఘమునకు గంజియును, స్త్రీ భిక్షువులకు స్నానము చేసుకొనునపుడు కట్టువస్త్రములను, నేను జీవించి యున్నంతవరకు ఇచ్చెదను. నాపై అనుగ్రహించి, ఇవి నావల్ల గ్రహింపుమని ఆమె వేడెను. ఈ వరములు వేడుటలో నీ వుద్దేశ్యమేమి యని ఆమెను బుద్ధుడు ప్రశ్నించెను అంత ఆమె ప్రొద్దున తన దాసివెళ్లి తిరిగివచ్చిన కథను విన్నవించెను. మొండిమొలతో నుండుట అపవిత్రము. అసహ్యకరము. అందువలన భిక్షువులకు వానకాలమున వాడుకొనుటకై రెండవజత వస్త్రముల నియ్యదలచితిని. పొరుగూరునుండి వచ్చు భిక్షువు నడచి నడచి డస్సిపోయి వచ్చును. త్రోవలో భిక్షమెత్తవలెనన్న కష్ట

ముగాయుండును. అట్లు ఇల్లు ఇల్లు దిరుగుచు దోవమరచి పోవచ్చును. నాయింటివద్ద ప్రత్యేకముగా వానికి భిక్ష యిచ్చినయెడ వానికి చిక్కియుండదు. అందుచేత వచ్చెడి భిక్షువులకు నేను అన్నమిడెదనని పొరుగూరుపోయెడి వాడు బాటసారులతో కలసిపోవుచుండును. ఒక్కొక్కప్పుడు మకాములకు చేరుట ఆలస్యము కావచ్చును. అప్పుడు వానికి భిక్ష దొరకదు. మధ్యగ్రామములో భిక్షయెత్తినయడల వానిని విడిచి బాటసారులు ముందుసాగుదురు. అప్పుడు అతను ఒంటరిగా బోవలసివచ్చును. ఒంటరి నడక కష్టము. కాన పొరుగూరు పోయెడివారికి భిక్షపెట్టెదను. రోగము వచ్చినవానికి పథ్యము కావలసియుండును భిక్షమెత్తిన అన్నముతినిన యెడల వానిజాడ్యము కుదురదు. కాన రోగులకు పథ్యపానముల నేనే యిచ్చెదను. రోగికి సేవచేయువానికి ఆసేవతోనే కాలముగడిచి పోవును. వాడు భిక్షయెత్తుకొని వచ్చువరకు అకాలమగును. అకాలమున అన్నము తినరాదని తాము శాశించిరి. అందుచేత ఆరోగియొక్క సేవకునకు నేనే తగినవేళ అన్నము పెట్టెదను. మందులు లేనియడల బాధ అధికమగును లేదా రోగము పెరిగి ఆతను చనిపోవచ్చును. కాన అవసరమయిన మందులను నేను తెప్పించి యిచ్చెదను. భిక్షుస్త్రీలకు గంజిదానము చేయుట మంచిదని మీరు అంధకవిందపట్టణమున చెప్పితిరి. కాన అట్టి గంజిని ఇచ్చుటకు నాకు ఉత్సాహముగలదు. ఆడ భిక్షువులు అచిరావతినది ఒడ్డున కొందరు వేశ్యలతోగూడ మొండిమొలతో స్నానము చేయుచుండిరి. ఈవేశ్యలు మీయాకావ

నమును యేలపాడుచేసెదరని వారిని వెక్కిరించిరి. ఈ వెక్కి రింపు వలన వారు కలవర పడిరి. స్త్రీలకు దిగంబరిత్వము అపవిత్రము, అసహ్యాకరము కాన వారిలకు స్నానము చేయుటకు ప్రత్యేకముగా బట్టల నిచ్చెదను. అని ఆమె తన మనస్సులోని కోరికలను బుద్ధునితో పూసగ్రుచ్చినట్లు మనవి చేసెను. అంత బుద్ధుడు యీవరము కోరుటలో నీకుగల ప్రత్యేక లాభము యేమి అని అడిగెను.

“ తాము యీనగరములో నుండగా అచ్చటచ్చట చాతుర్మాస్యలు గడిపిన భిక్షువులు మిమ్ములను చూడవచ్చు చుందురు. అక్కడక్కడ యెవరో భిక్షువులు చనిపోయిరని వారు చెప్పుచుందురు. వాని సాధనకు ఫలితముగా యెట్టి యెట్టి ఉన్నతస్థితిని పొందెనని మీరు ఆడుగుచుందురు. అట్టి వేళ నేను ఆక్రొత్తవారి దగ్గరకు పోయి ఆచనిపోయిన భిక్షువు యెన్నడయిన శ్రావస్థి నగరముకు వచ్చెనా యని అడిగెదను. వారు ఔనని చెప్పిన యెడల ఆచనిపోయిన సోదరుడు యిచ్చట నావలన ఉపచారము పొందెనుగదా అని యెంచెదను. అంత నాకు తృప్తి కలుగును. దానిచే సంతోషమును, ఆనందమును దానిచే శాంతియును, దానిచే సాధనయును, దానిచే జ్ఞానమును, కలుగును. నేను ఈ వరములు అడుగుటలో నాయుద్దేశ్యములు యివియే ” అని ఆమె బుద్ధునికి విన్నవించెను.

“ విశాఖా ! మంచిది. ఇట్టి ఉద్దేశ్యముతో వరములు కోరుట మేలైనపని. యెవరయినను మనసునందు ఉత్సాహ

ముతో, కోరికలు లేకుండ, లోభములేకుండ, అన్నపాన ములనిచ్చిన యెడల వారికి దుఃఖము నశించును. సంతోషము కలుగును. సన్మార్గము కనబడును. నాశనములేని, అపవిత్రముగాని, శ్రేయస్సును పొందును." అని బుద్ధుడు ఆశీర్వదించి, విశాఖకు కృతజ్ఞత దెలిపెను.

ఒకనాడు బుద్ధుడు శ్రావస్థీనగరములోనుండగా విశాఖ వారిని సమీపించి మొగము తుడుచుకొనుటకు ఒక వస్త్రము వారికి అర్పించెను. చెమట పోయునపుడు అది ఉపయోగించునని ఆమెయుద్దేశించెను.

మరి ఒకప్పుడు బుద్ధభిక్షువులలో కల్లలు సంభవించి రెండుకక్షలు యేర్పడెను. అందులో నొకరు బుద్ధుడున్న చోటికివచ్చుచుండిరి. వారిని యెట్లు ఆదరించవలెనో విశాఖకు తోచక బుద్ధుని సమీపించి తాను యేమిచేయవలెనని అడిగెను. అందుకు ఆయన యిట్లు ఆనతిచ్చెను. "విశాఖా! రెండుపక్షములవారును చెప్పు ధర్మమును వినుము. ఉభయులకును కానుకలర్పించుము. యెవరు చెప్పిన అభిప్రాయము బుద్ధధర్మముతో అనుకూలముగా నున్నదో దానిని అంగీకరించి, ఆపక్షము సక్రమమయినదని నమ్ముము.

ఆమె భిక్షుసంఘమునకు చిన్నచిన్న కుండలను స్తంభములమీద పెట్టు కాయలును అప్పుడప్పుడిచ్చుచుండెను. ఆమె భిక్షుసంఘమునకు మేడలనుగూడ కట్టించి యిచ్చుచుండెను.

—...—

## కాశీరాజుకథ.

—...—

ఒకానొక కాలమున కాశీనగరములో బ్రహ్మదత్తుఁడను రాజు రాజ్యము చేయుచుండెను. అదేసమయమున కోసలములో దీఘీతి అనువాఁడు రాజుగానుండెను. కాశీరాజునకు ధనము, సేన, రథములు, రాజ్యము, పన్నులు విస్తారముగా నుండెను. కోసలపతికి అన్నియు కరవయ్యెను. బ్రహ్మదత్తుఁడు చతురంగసేనతో కోసలముమీఁద దండెత్తెను. ఈతని దాడికి ఓర్వఁజాలక దీఘీతి తన నగరమును విడిచి తానును తనరాణియు పారిపోయిరి. కోసలము కాశీరాజ్యములో చేరిపోయెను. అచ్చటచ్చట తిరిగి తిరిగి మారువేషములు వేసుకొని దీఘీతియు, భార్యయు కాశీనగరముచేరి ఒక కుమ్మరివానియింటిలో కాపురముండిరి. దీఘీతి సన్యాసివలె, భిక్షమెత్తి కాలము గడుపుచుండెను.

ఇట్లుండగా ఆయనభార్య గర్భవతి యయ్యెను. వేవిళ్ల కాలములో ఆమెకు ఒకకోరికకలిగెను. సూర్యుఁడు ఉదయించు వేళ వ్యూహముగా పన్నిన చతురంగసేనను చూడవలెననియు, వారికత్తులు గడిగిన నీటిని త్రాగవలెననియు, ఆమె తలపెట్టెను. ఈసంగతిని భర్తతో చెప్పెను. ఇది దుస్తరమని అతను చింతించెను. ఇదిచూడకపోయిన నేను బ్రతుకనని ఆమె చెప్పగా దిఘీతి ఉపాయములు వెదక నారంభించెను. అదృష్టవశమున బ్రహ్మదత్తునిపురోహితబ్రాహ్మణుడు దిఘీతికి

స్నేహితుడు. అంత దీక్షితి తన స్నేహితునితో యీమాట చెప్పెను. ఆబ్రాహ్మణుడు ఈతను ఉండుచోటికివచ్చి గర్భిణీ నిజమని తెలుసుకొని ఆమె కోర్కెతీర్చెదనని చెప్పిపోయెను. ఆమె గర్భమందు కోసలరాజు మెలగుచున్నట్లు ఆతను ఊహించెను. పిమ్మట బ్రహ్మదత్తుని సమీపించి రేపు శుభమయమనియు, అట్టిచో పవిత్రమయిన స్థలమునందు కవచములను ఖడ్గములును ధరించి చతురంగ సేనలు బారులుదీరి సూర్యోదయమువేళ నిలువవలయుననియు, వారుకత్తులు నీటిలో కడుగవలయుననియు, సలహా చెప్పెను. బ్రహ్మదత్తుడు సమ్మతించి అట్లే ఆజ్ఞాపించెను. అందువలన ఆ సేనలు అట్లు అమర్చబడెను. దీక్షితునిభార్యకోరిక తీరెను. నెలలునిండగానే ఆమె ప్రసవమయి ఒకబాలుని కనెను. వానికి దీర్ఘాయువు అని పేరిడిరి. ఇట్లు కాలముగడుపుచుండ దీర్ఘాయువు యౌవనవంతుడయ్యెను. అంత దీక్షితి "కాశీరాజు మావిరోధి మారాజ్యపట్టిన మాముమ్వురను చంపించును. కాన యీ దీర్ఘాయువును మరొకచోట నుంచుట మంచిది. అని ఆలోచించి కాశీపురి బయట బస యేర్పాటు చేసెను.

ఇట్లుండగా యీదీక్షితి మంగలి యొకడు కాశీలో తిరుగుచు దీక్షితిని గుర్తుపట్టి బ్రహ్మదత్తునిచేరి యీ రహస్యమును చెప్పెను. అంత బ్రహ్మదత్తుడు తన బంటులను బంపి వీరిద్దరిని బట్టి తెప్పించి వీరల పట్టణమెల్ల త్రిప్పవలెననియు, కాళ్ళు చేతులు కట్టివేయవలెననియు, తలలు గొరిగించవలెననియు, నాలుగు ముక్కలుచేసి నాలుగువైపుల పారవేయవలయు

నియు, ఆజ్ఞాపించెను. రాజభటులు యిటుల త్రిప్పుచుండగా తల్లిదండ్రులను చూడవలెనని కోరికగలిగి కాశీలో ప్రవేశించిన దీర్ఘాయువు వారల దగ్గరకు వచ్చెను. వానినిదూరమునుండియే దీక్షితి చూచెను. దీర్ఘాయూ! దూరము చూడవద్దు. దగ్గర చూడవద్దు. ద్వేషమువల్ల శాంతింపదు. అద్వేషమువల్లనే శాంతించును అని కేకలిడెను. ఆ కేకలువిని దీక్షితికి పిచ్చి యెత్తినదని రాజభటులు తలంచిరి. నాకు పిచ్చిలేదనియు, తెలివిగలవాడు దీనిని అర్థము చేసుకొనుననియు, తిరిగి దీక్షితి బదులు చెప్పెను. కాని రాజభటులు నమ్మలేదు. దీక్షితికిని దీర్ఘాయువునకునుగల సంబంధము ఊహించలేదు. రాజాజ్ఞ ప్రకారము భార్యాభర్తలను ఊరివెలుపలకు నడిపించి నరికి ముక్కలుచేసి పారవేసిరి. కొందరు భటులు అచ్చట కాపలా యుండి తక్కినవారు వెడలిపోయిరి. నిషాయెక్కువగాగల మద్యమును తెచ్చి దీర్ఘాయువు వారల త్రాగించెను. వారు త్రాగి పడిపోయిరి. తన తల్లిదండ్రుల దేహముల ముక్కలను పోగుచేసి దీర్ఘాయువు కాష్టముపేర్చి నిప్పంటించి దాని చుట్టును ముమ్మారు దిరిగి నమస్కారము చేసెను. బ్రహ్మదత్తుడు తన మేడమీదనుండి దీనినిచూచి వీడు యెవడో దీక్షితి కులస్థుడో లేక బాంధవుడో అనుకొనెను.

అక్కడ దగ్గరనున్న అడవికిబోయి కడుపు పగులునట్లు దీర్ఘాయువు యేడ్చెను. కన్నీరు దుడుచుకొని ఆలోచించుకొని తిరిగి కాశీ ప్రవేశించెను. రాజు ఏనుగశాలవద్దకుబోయి మావటీలలో మేటిని సమీపించి, అయ్యా! నాకీపని నేర్ప

మనెను. ముద్దుబిడా! కూరిమికుర్రవాడా! అట్లే నేర్చుకొనుము అని వాడు చెప్పెను. దీర్ఘాయువు ఆరాత్రి అక్కడనే నిద్రపోయెను. వేకువఝామున లేచి శితారు తీసుకొని చక్కని గొంతుతో పాటపాడెను. రాజనగరులోని బ్రహ్మదత్తుడు ఆపాటవిని సంతోషించి మరునాడు వీనిని గురించి విచారించి పిలిపించుకొనెను. రాత్రిపాటపాడినదినీవేనా ? అని యడిగెను. అవునని చెప్పగా మరల నొకమారు పాడుమని ఆజ్ఞాపించెను. మరింత యింపుగా దీర్ఘాయువు సంగీతము పాడెను. రాజు వానిని మెచ్చుకొని ఖుద్దున నౌకరుగా యేర్పరచెను. దీర్ఘాయువు రాజుకంటెముందు నిద్రలేచుచు, తు, చ తప్పకుండ ఆయన ఆజ్ఞను పాలించుచు. అనుకూలముగా ప్రవర్తించుచు, ఇంపుగా మాటలాడుచు రాజు నిద్రబోయిన తరువాత పడుకొనుచు అన్ని విధముల రాజుకు అనుకూలుడయ్యెను. రాజు విశ్వాసము హెచ్చి తన దగ్గరగానుండు పెద్ద హోదాను యిచ్చెను. ఒకనాడు రాజు వేటకుబో దలచి గుర్రములను కట్టి రథము తెమ్మని దీర్ఘాయువును పంపెను. అట్లు రథము తేగా రాజురథమెక్కి దీర్ఘాయువును తోలుమనెను. సేనలు వెంటవచ్చుచుండెను. కొంతదూరముపోయి దీర్ఘాయువు దోవ తప్పించి వేరు దోవ పట్టించి సేనకు బహుదూరముగారాజును తీసుకొనిబోయెను. రాజు అలసిపోయి, రథమును ఆపించి దీర్ఘాయువు తొడమీద తలపెట్టుకొని ఒక్కింత తడవు నిద్రించెను. అయొంటరిపాటున బ్రహ్మదత్తుడు చే జిక్కించుకొనిన దీర్ఘాయువునకు మంచి అదను దొరికెను. తన సేనను, రాజ్య

మును సర్వస్వమును దోచుకొని తలిదండ్రుల నరికించిన రాజుపయి కసిదీర్చుకొనుటకు ఇదే తరుణమని దీర్ఘాయువు వరనుండి కత్తిదూసెను. అప్పుడు దిఘీతిచెప్పిన పలుకులు అతనికి జ్ఞాపకము వచ్చి తండ్రిమాట జవదాటరాదని కత్తిని మరల వరలో దాచెను. ఇట్లు కత్తిదూయుటయు దాయుటయు రెండుమూడు పర్యాయములు జరిగెను. ఇంతలో బ్రహ్మదత్తుడు తటాలున ఒడలు ఒణుకుచు భయపడుచు ఆవేదనతో లేచెను. ఇట్లు యేల లేచితిరి. అని దీర్ఘాయువు అడిగెను. కోసలరాజయిన దిఘీతి కొడుకు దీర్ఘాయువు కత్తిని ఆడించుచు నాపై దుమికినట్లు కలగంటిని. అని రాజు చెప్పెను. అప్పుడు దీర్ఘాయువు రాజు నెత్తిన తనయెడమచేతిని బెట్టి, కుడిచేతితో కత్తినిలాగి, నేనే దీర్ఘాయువును, నీవు చేసిన కీడుకు కసితీర్చుకొందును అని బెదరించెను. నిరాయుధుడయిన బ్రహ్మదత్తుడు, దీర్ఘాయువు కాళ్ళమీదపడి నాప్రాణము రక్షించుమని ప్రార్థించెను. దీర్ఘాయువు నేను నిన్నెట్లు రక్షించగలను. నీవే నాప్రాణదానము చేయుము అని బ్రహ్మదత్తుని కోరెను. అట్లయినచో దీర్ఘాయువూ! నీప్రాణము రక్షించితిని. నాప్రాణమును కాపాడుమని తిరిగి బ్రహ్మదత్తుడు కోరెను. ఒండొరులు ప్రాణముల కాపాడుకొందుమని ప్రమాణములు చేసుకొనిరి. తిరిగి రథమును అమర్చుకొని కాశీ చేరిరి. రాజు తన మంత్రులనుబిలచి దిఘీతికుమారుడు కనబడినయెడల యేమిచేయవలెనని సలహా అడిగెను. ఒకడు కాళ్లను, ఒకడు చేతులను, ఒకరు తలను, నరక వలెనని సలహా చెప్పిరి. రాజు అడవిలో జరిగిన కథ నం

తయు వారికి చెప్పి ఈదీర్ఘాయువును ·యెవరు తాకగూడదు. అని ఆజ్ఞాపించెను. నిద్రించుచున్న రాజును దీర్ఘాయువు యేల చంపలేదు. అని ప్రశ్నరాగా తన తండ్రి చెప్పిన మాటలను దీర్ఘాయువు వారికి వినిపించెను. విరుద్ధముగానున్న ఆ మాటల భావ మేమని వారు అడిగిరి. అంతట దీర్ఘాయువు ఇట్లుబదులు చెప్పెను. దూరముగా చూడవద్దు. అనగా:— క్రోధము చాల కాలము మనసులో ఉంచుకొనగూడదు. దగ్గరగా, చూడకుము అనగా:— త్వరపడి స్నేహితులతో పోట్లాడకూడదు. ద్వేషము వలన ద్వేషము శమించదు అనగా :— మీరు నాతలిదండ్రు లను చంపితిరి. నేను మిమ్ము జంపెదను. మీ భటులు నన్ను జంపెదరు. నాస్నేహితులు వారిని జంపెదరు. ఇట్లు అంతులేకుండ ద్వేషము పెరుగునుగాని ఆ నిప్పు చల్లారదు. అని అర్థము. అద్వేషమువలన ద్వేషము శమించును. అని దాని భావము. ఇదియ మీరు నాప్రాణము రక్షించితిరి. నేను మీప్రాణము కాపాడితిని. మనకు స్నేహము యేర్పడి పూర్వ ద్వేషములు నశించినవి. ఈమాటలను వినిన వారందరును దీర్ఘాయువును మెచ్చుకొనిరి. రాజు తన కూతురునిచ్చి పెండ్లి చేసి, కోసలరాజ్యమును, సేనను, ధనమును అరణముగా నిచ్చెను.

భిక్షుసంఘములో తగువులువచ్చి చీలికలుగలిగినప్పుడు బుద్ధుడు యీకథను చెప్పెను.

—...—

## —§ ద బ్బా క థ. §—

—...—

మాల్యదేశస్థుడయిన దబ్బాఅనువాడు యేడవసంవత్సరమునవే అర్హంతుడయ్యెను. వాని కర్మసంచయమును, ప్రారబ్ధమును నశించెను. ముందు చేయదగిన కర్తవ్యము లేకుండెను. ఒకనాడతడు ధ్యానములోనుండగా ఈ భిక్షుసంఘమునకునేను యేమయిన సేవచేయుగలనా? అనుఆలోచన స్ఫురించెను. వీరలకు ఆయుద్రవ్యముల పంచిపెట్టుటయు, ఇండ్లకు వసతులచూపుటయు, మంచిది అని ఆయనకు తోంచెను. ఆనాడు సాయంత్రము బుద్ధుని సమీపించి నమస్కరించి ఒకవైపున కూర్చుని తనకు తోంచిన ఆలోచనలను బుద్ధునితో మనవిచేసెను. బుద్ధుడు నీకుతోంచినది మంచిదే. అట్లే జరుపుమని ఆనతిచ్చెను. దబ్బా సంతసించి ఆపనికి బూనెను. అప్పుడు సంఘములో తీర్మానముచేసి వీరిని ఆయా పనులకు నియమించిరి. దబ్బా ఆభిక్షువుల కందరకు అనుకూలమగునట్లుగా వసతులను చూపుచుండెను. వినయముతో చదువువారు అందరు ఒకవైపునను, ధర్మముబోధించువారు ఇంకొకవైపునను, సూత్రాంతములు పఠించువారు యింకొక వైపునను, ధ్యానముచేయువారు యింకొక వైపునను అట్లు వస వసతులు యేర్పాటు చేసెను. కొందరు దబ్బాను పరీక్షించుటకై ఆలస్యముగా వచ్చుచు, దూరప్రదేశములనుకోరుచూ, ఆతనిని త్రిప్పుచుండిరి. కాని యెట్లు యెప్పుడు యేవేళ ఎవరు

వచ్చినను వారల కందరకు తగిన వసతుల చూపుచుండెను. ఇది నీపక్క, ఇది నీపీట, ఇదియే చాప. దిండు ఇది. పాయిఖానా అది. మంచినీరుఇది, ఇతరవాడుకనీరుఅది, ఇది చేతికర్ర, అది సంఘమువారు సభచేసెడి చోటు, ఆయా వేళల రావలెను. ఆయూవేళల పోవలెను. అని అన్ని సంగతులు వారికి తెలియజేప్పుచుండెను. ఆభిక్షువులలో మెట్టియుడు, భుమ్మజక, అనువారు యిద్దరును, వారి అనుచరులును, తమకిచ్చిన గదులు, తినుబండారములు తృప్తిగాలేవని సణుగుచుండిరి. రాజగృహనగరములో ఒక గృహస్థు ధనవంతుడై భిక్షువులను యెల్లకాలము విందుకు పిలుచుచుండెను. ఒకనాడు ఆతడు దబ్బావద్దకు వచ్చి, వానితో సంప్రదించి, మరునాడు తన యింటకివచ్చు భిక్షువు లెవరనిఅడిగెను. మెట్టియ భుమ్మజక ముతావత్తురని దబ్బా చెప్పెను.

ఈ గృహస్థుకు ఈమెట్టియముతానుగూర్చితృప్తిగలుగలేదు. అందుచే వారలు వచ్చుసరికి సామాన్యమైన వంటకములు చేయించి వారికి వడ్డించమని తన నౌకరుతో చెప్పెను. ఈభిక్షువులువచ్చి భుజించిరి. తమకు సరియయిన ఆదరణ కలుగలేదని తలచిరి. దీనికి దబ్బా కారకుడని యెంచిరి. క్రిందటిరోజు దబ్బాయును, ఈగృహస్థు మాట్లాడినప్పుడు దబ్బా మనపై నిందలుమోపియుండును సందేహించిరి, మరునాడు మిట్టియా, అను ఆడభిక్షువు ఈముతా దగ్గరకువచ్చి ఒకటి, రెండు, మూడుపర్యాయములు నమస్కారము చేసెను. వీరు మెదలకుండ నుండిరి. నేను యేమితప్పుచేసితిని. మీకేల

కోపమువచ్చె. ఏలనాతో మాట్లాడరు అని ఆమె అడిగెను. దానికి బదులుగా వారు యిట్లు చెప్పిరి. దబ్బా మమ్ము బాధ పెట్టుచున్నాడు. నీవు యేమియు పట్టించుకొనవు. నీవు తల పెట్టినచో ఈ దబ్బాను ఒక నిమిషములో వెళ్లగొట్టగలవు. ఈమాటలువిని ఆయమ ఉపాయము ఏమని అడిగెను. నీవు బుద్ధునియొద్దకుబోయి, "అనుకొననిచోటున ఆపద బుట్టినది. నీరు నిప్పయి మండుచున్నది. దబ్బా నన్ను భంగపరచెను" అని బుద్ధునియొద్ద మొరబెట్టుమని వారు సలహా చెప్పిరి. ఆమె అట్లే చేసెను.

బుద్ధుడు భిక్షుసంఘసభజరిపి సభలో దబ్బాను పిలిచి "దబ్బా! ఈ ఆడభిక్షువు చెప్పినపనిని చేసినట్లు నీకు గుర్తు గలదా?" అని అడిగెను. "ప్రభో! భగవంతుడా మీరు నన్ను యెరిగయేయున్నారు" అని దబ్బా జవాబుచెప్పెను. బుద్ధుడు రెండవ మూడవమారుకూడా అడుగ దబ్బా యట్లే జవాబు చెప్పెను. అంతట బుద్ధుడు "నీవంటివారు నిందను ఇట్లు యెదిరించరు. నీవు చేసినచో ఒప్పుకొనుము. చేయ నిచో చేయలేదని చెప్పుము" అని బుద్ధుడు పలికెను. "ప్రభో! నేను పుట్టినది మొదలు యింతవరకు జాగ్రత్త స్థితిలో సంభోగము చేయలేదు సరిగదా కలలోనయినను అట్లుచేసినట్టు నాకు రవంతయు గుర్తులేదు." అని దబ్బా మనవిచేసు కొనెను. ఈ ఆడభిక్షువు ఆమెట్టియమునా వలన పురిగొల్పబడినట్లు తెలియవచ్చెను. ఈమెను వెడలనడుపుడు. వారల విచారించుడు. అని బుద్ధుడుచెప్పి లేచిపోయి విహార

ములో ప్రవేశించెను. (విహారమనగా వారుండినగది) అంత ఆమెట్టీయముతా భిక్షువులు లేచి "సభ్యులారా! యీమెను శిక్షించవద్దు. యీమె నేరముచేయలేదు. మేము మాకోపము చేత చెడు తలంపుతో దబ్బాను అవమానించుటకు యీమెను పురికొల్పితిమి" అని మెట్టీయ ముతాభిక్షువులు చెప్పు కొనిరి. అప్పుడు దబ్బా శుద్ధ నిర్దోషియని సంఘమువారు తీర్మానించిరి.

ఇంకొకపుడు, వత్థ అనువాడు, యీమెట్టీయ భుమ్మజ కల స్నేహితుడు. వారల సమీపించి వందనము చేసెను. రెండు మూడు మారులు పలుకరించిసను వారు పలుకకైరి. పలుకని కారణమేమని ఆతనడుగ దబ్బా తమను యిబ్బంది పెట్టుచున్నాడనియు, ఆతనిని వెళ్ళగొట్టించవలయుననియు, వారు కోరిరి. ఉపాయమేమని వాడు అడుగగా నీభార్యను దబ్బా చెరిచినట్లుగా బుద్ధునితో ఫిర్యాదిచేయుము అని వారు సలహా చెప్పిరి. యీ వత్థుడు అట్లే చేసెను. బుద్ధుడు మరల సభచేయించి దబ్బాను ప్రశ్నించెను. దబ్బా వెనుకటివలెనే తన సత్ప్రవర్తనను రూఢిపరచెను. బుద్ధుడు యీ వత్థు మీాద చర్యజరుపుడు అని సంఘమువారితో చెప్పెను. యీ వత్థా ఉపాసకుడు. అనగా గృహస్థ శిష్యుడు. భిక్షుసంఘములకు భిక్షల నిచ్చుచు పరిచర్యలు చేయుచుండెడివాడు. ఉపాసకుడు యెప్పుడయినను తప్పుజేసిన యెడల భిక్షుసంఘము వానిపై కమండలములను బోర్లింతురు. అనగా వారియిండ్ల భిక్ష మొదలగునవి పైకొనరు. ఇట్టి శిక్ష తనకు విధింపబడిన

దని మరునాడు ఉదయమున ఆనందుని వలన వత్థా తెలుసుకుని అచటనే స్పృహతప్పి పడిపోయెను. వారి స్నేహితులును, బంధువులును చేరి చాలు జాలు. ఏడ్వకుము. గోల పెట్టకుము. మనము భగవంతుని యొద్దకుబోయి ప్రసన్నుని జేసికొందము. అని సలహా చెప్పిరి. అంతట వత్థాయును, ఆతని భార్యా పిల్లలును, రక్తబంధువులును, స్నేహితులును, స్నానములు చేసి, విరియబోసిన జుట్టుతో, తడి బట్టలతో బుద్ధుని చెంతకు వచ్చిరి. వత్థుడు బుద్ధుని కాళ్ళమీదపడి పాపము నన్ను లోబరచుకున్నది. నా మనోదుర్బలమువలన నామూర్ఖతవలన, నా అధర్మమువలన, నిష్కారణముగా దబ్బామీద నిందమోపితిని. నేను నాపాపమును పూర్తిగా మీయెదుట ఒప్పుకొనుచున్నాను. ఇకముందు యెన్నడును యిట్టిపనులు చేయను అని వాడు బుద్ధునితో మనవి చేసుకొనెను.

వత్థా! మిత్రమా! నిజముగా పాపమునకు లోబడితివి. నీమనోదుర్బలము. నీమూర్ఖత, నీఅన్యాయము నిన్ను యిట్లునిష్కారణముగా దబ్బామీద అపనింద వేయుటకు నిన్ను పురికొల్పెను. కాని మిత్రమా! నీపాపము పాపమనిగ్రహించి తగినట్లు ప్రాయశ్చిత్తము చేసుకొంటివి గనుక నీపశ్చాత్తాపమును మేము అంగీకరించుచున్నాము. మిత్రమా! యీసిద్ధాంతములోయున్న మేలు యిదియే. యెవడు తన పాపమును పాపమని గ్రహించునో దానికి తగిన ప్రాయశ్చిత్తము చేసుకొ

నునో వాడు పిమ్మట అట్టిపాపమునకు జొరకుండ నిలుచుటకు శక్తివంతుడగుచున్నాడు.

—...—

## —ఁ ఏనుగు, కోతి, తిత్తిరిపక్షి కథ. ఁ—

—...—

భిక్షు సంఘములో నెవరుగొప్పయని ఒకనాడు ప్రశ్న వచ్చెను. జాతిచేత క్షత్రియుడయిన భిక్షువు హెచ్చా? జాతిచేత బ్రాహ్మణుడయిన భిక్షువుహెచ్చా? యీ మొదలగు ప్రశ్నలు పుట్టెను. కొందరు భిక్షువులు అందరిలో క్షత్రియభిక్షువు హెచ్చుఅనిరి. కొందరు బ్రాహ్మణభిక్షువు హెచ్చు అనిరి. వైశ్య లేక గృహపతిజాతి భిక్షువులు హెచ్చు అని కొందరు చెప్పిరి. కొందరు జాతిమాట యెత్తక సాధనలోని వరుసక్రమమునుబట్టి హెచ్చుతగ్గులుచెప్పిరి. అప్పుడు బుద్ధుడు యీకథను చెప్పెను.

హిమవత్పర్వత సమీపమున, ఒకమర్రిచెట్టు వుండెను. దానినీడను ముగ్గురు స్నేహితులు కాపురము చేయుచుండిరి. వారుముగ్గురును, ౧, యేనుగ, ౨, కోతి, 3, తిత్తిరి, తమలో తాము గౌరవమును, విశ్వాసమును లేకుండ కాలము గడుపుచుండగా వారికి ఒక ఆలోచన తోచెను. మనలో యీడులో యెవరుపెద్ద అని తెలుసుకొని వానినినాయకునిగా చేసికొని నడచెదము అని అనుకొనిరి. అంతటకోతియు, తిత్తిరియు,

నీకు యెన్ని యేండ్లనాటి కథలు తెలుసును అని యేనుగ నడిగెను. నేను చిన్నవాడనుగానుండగా యీ మఱ్ఱిచెట్టు నా తొడలవరకు వచ్చుచుండెడిది. అంతవరకే నాకు గుర్తుగలదు. అని ఏనుగ చెప్పెను. తక్కిన యిద్దరిలో కోతిని అడుగగా, నేను చిన్నదాననయి నేలప్రాకులాడునపుడు ఈచెట్టుయొక్క చిటారుకొమ్మను పండ్లతో కొరుకుచుంటిని అని చెప్పెను. అట్టి ప్రశ్న తిత్తిరికి వేయగా అది యిట్లు జవాబు చెప్పెను. స్నేహితులారా! ఆ కనుచూపుమేరన మునుపొక పెద్ద మఱ్ఱి చెట్టు వుండెడిది. దాని పండ్లను నేను తిని విత్తు నిక్కడ పార వేసితిని. ఆవిత్తన మీచెట్టు అయ్యెను. కావున మీయిద్దరి కంటె నేనే పెద్దదానను. ఆమాటలువిని యేనుగును, కోతి యును, స్నేహితుడా! నీవే మనలో పెద్దవాడవు. నిన్ను గౌరవించెదము. నీసలహా చొప్పున నడచెదము." అని వానికి చెప్పి ఆప్రకారము నడుచుకొనిరి. ఆతిత్తిరి వీరలను సక్రమ మార్గమున నడపెను. వారుయీదేహములను విడిచిన పిమ్మట ఉత్తమ గతులను పొందిరి. ఏవయసులో పెద్దవారిని గౌరవింతురో వారే ధర్మము తెలిసినవారు. వారున్ను ఇహాపరముల కీర్తిని సుఖమును పొందెదరు జంతువులు, పక్షులు యిట్లు ప్రవర్తించుచుండుటచేత, మానవులుగూడ యిట్లు నడచుట యుక్తమని బుద్ధుడు శలవిచ్చెను. ఈసంఘములో చేరినవారు వయసుచేత పెద్దలైన వారికే గౌరవ, మర్యాదలు చూపవలెను. కాని వయసునుబట్టి యెవరును సంఘపుఆస్తిని స్వయముగాఉపయోగించుకొనరాదు. అని బుద్ధుడుకట్టుబాటుచేసెను.

## —॥ అనురుద్ధుని కథ. ॥—

శాక్యవంశజులైన అనురుద్ధుడు, మహానాముడు అని యిద్దరు అన్నదమ్ములు గలరు. బుద్ధభగవానులు మతబోధ చేయ మొదలుపెట్టిన నాటనుండి మనశాక్యులలో చాలమంది యువకులు ఆయన ననుసరించి భిక్షువులయిరి. 'మన యింట నుండి యెవరును భిక్షువులు కాలేదు. నేనో, అనిరుద్ధుడో భిక్షువులగుట మేలు. అని మహానాముడు తలచి తన సోదరునితో, నీవో, నేనో, భిక్షువు అగుదుము. గృహస్థములోనున్న వానికి గలుగుపనులు చూడుము. మొదట పొలములు దున్నించవలెను. తరువాత విత్తవలెను, తరువాత నీరుపెట్టవలెను. పిమ్మట నీరువెళ్ళగొట్టవలెను. తరువాత కలుపుతీయవలెను. పైరుకోయవలెను కోయించికట్టగట్టి మోయించవలెను. నూర్చవలెను. తూర్పారబట్టి గడ్డివేరుచేయవలెను. ధాన్యమును పాతర్లు పోయవలెను. ఇది ఒకయేడు చేయు పని వరుస. ఇట్లే ప్రతియేడు చేయవలెను. దీనికి అంతు అగపడదు. మన తండ్రులు తాతలు చేసిరి. పూర్తిగాక మనకు వదలిరి. దీని అంతము జూచు కెన్నడో గదా. ఎన్నడు యింద్రియపటుత్వము తగ్గకముందు, విశ్రాంతి నొందుదుము. అని అనురుద్ధునితో చెప్పెను. అంతట అనురుద్ధుడు తానే భిక్షువు నగుదునని నిశ్చయించుకొని మహానామునితో చెప్పి, తల్లివద్దకుబోయి అనుమతిమ్మని కోరెను. ఆయమ్మ మీయిద్దరే నా కుమాళ్ళు. మిమ్ము

వదలి సేవింపజాల. నేను బ్రతికియుండగా నీవుభిక్షువగుటకు అంగీకరించను. అని ఆయమ వానితో చెప్పెను. వాడు, మరి మరి బ్రతిమాలగా మనరాజు భద్రీయుడు సన్యసించిన యెడల నీవును పొమ్ము. అనిఆమె చెప్పెను. ఆరాజు యిల్లు విడువడని ఆమె నమ్మెను. అంత అనురుద్ధుడు, భద్రీయుని యొద్దకు బోయెను. మిత్రమా! నేను సంసారమును త్యాగముచేయను వలయుననియున్నది. ఆత్యాగమునకు నీవు అడ్డుతగులుచున్నా వని అనురుద్ధుడు రాజుతో చెప్పెను. అట్లయినయెడల ఆ అడ్డును తొలగించుము. నేనుగూడ నీయిష్టప్రకారముచేసెద. నీవు త్యజించుము. అని రాజు చెప్పెను. రమ్ము. స్నేహితా! మన నిర్ధారము వదలెదము. అని అనురుద్ధుడు పురికొల్పెను. నేను ఇల్లు వదలిపెట్టలేను. ఇంకేదయినను కోరుము చేసెదను. నీవొక్కడవే పొమ్ము. అని రాజు మరల చెప్పెను. అంత అనిరుద్ధుడు తన తల్లికిని, తనకును జరిగినమాటలను చెప్పి, రాజా! నీవు మొదట నాతో చెప్పిన వాక్యములలో నీవు కూడ నాతో లోకమును త్యజింతునని చెప్పియుంటివి. అట్లుచెప్పియు ఇప్పు డెట్లు మారెదవు? అని అనురుద్ధుడు రాజను యిరుకునబెట్టెను. ఆకాలమునాటి ప్రజలు నిజము మాట్లాడుచుండిరి. మాట తప్పెడివారు కారు. అందుచేత రాజు నేను రాజ్యమును త్యజించి నీతోగూడ భిక్షువు నయ్యెదను. కాని యేడుయేండ్లు ఆగుము. ఇద్దరము కలసి పోయెదము. అనివాయిదాకోరెను. అనిరుద్ధుడుదానికిసమ్మతించలేదు. అంతట యేడేండ్లనుండి నెలలకును, నెలలనుండిపక్షములకును వాయిదాలు కోరెను. దీనికిని

అనిరుద్ధుడు సమ్మతింపడయ్యె. చిట్టచివరకు నారాజ్యము, నా కుమాళ్ళకును, నాసోదరులకును. ఒప్పగించుటకు యేడు రోజులు వాయిదా నిమ్మని రాజు కోరెను. అనిరుద్ధుడు అందులకు ఒప్పుకొనెను.

ఆ వారము గడచెను. భద్రీయుడును అనురుద్ధుడును, ఆనందుడును, భాగుడును, కించిలుడును, దేవదత్తుడును, వీరల మంగలి ఉపాలియును బయలుదేరిరి. ఈ మొదటి ఆరుగురును శాక్యవంశపు క్షత్రియులు. వారు అప్పుడప్పుడు ఆటపాటలకు వేటలకు చతురంగ సేనలతో పోవుచుండిరి. అట్లే ఇప్పుడును పరివార సహితముగా బయలుదేరిరి. కొంతదూరము పోయి రాణువను వెనుకకు పంపిరి. మరికొంత దూరముపోయి తమ నగలను తీసి బట్టలలో మూటగట్టి ఉపాలికి యిచ్చి నీజీవనమునకు ఇది చాలును. వెనుకకు పొమ్ము. అని వానిని మరల్చిరి. ఈ ఉపాలి కొంతదూరము వెనుకకు బోయెను. ఈ శాక్యులు క్రూరులు. నేను నగరమునకు పోయినయెడల నన్ను వారు చంపుదురు. ఇంతమంది శాక్యయువకులు భిక్షువులగుచుండగా నేనేల కాగూడదని ఉపాలి యోజించుకొని తనకిచ్చినమూటను ఒకచెట్టుకు గట్టి, యెవరికి దొరికితే వారు తీసుకొందురుగాక! అనిపలికి తిరిగి క్షత్రియకుమారు లున్నచోటికి వచ్చెను. వీని చూచి నీవేల తిరిగి వచ్చితివి అని ఆమంగలి నడిగిరి. వాడు తన మానసులోని సంగతి చెప్పెను. వారు ఆమోదించిరి. ఉపాలిని తమతోగూడ బుద్ధభగవానుని యొద్దకు తీసుకొని పోయిరి. బుద్ధునకు నమస్కరించి ప్రక్కన కూర్చుండి బుద్ధు

నితో యిట్లు మనవి చేసిరి. " ప్రభో ! మేము శాక్యులము. గర్వము గలవారము. ఈమంగలి మాకు చాలకాలము సేవ చేసెను. వానికి మాకంటె ముందుగా దీక్షనిప్పించుడు. మేము అప్పుడు వానిని పెద్దగా నెంచి సాష్టాంగపడెదము. అప్పుడు మా గర్వమణిగిపోవును." అని వీరువిన్నవించి వీరి కోరిక ప్రకారము మొదట ఉపాలికుని, తరువాత శాక్యులకు బుద్ధుడు దీక్ష నిచ్చెను. కొన్ని నెలలు గడుచులోపల వారివారి యోగ్యత లనుబట్టి వారికి సాధనలు అభివృద్ధి కలిగెను. అనురుద్ధునకు అహంకారమును, అనుమానమును, కర్మకలాపములందు విశ్వాసమును అను మూడు భ్రమలు తొలగిపోయెను.

శాలకగ్రామమునందు, పూజ్యులయిన అనురుద్ధుడును, నందీయుడును, కించిలుడును, చాతుర్మాస్యలు గడుపు చుండిరి. ఆసమీపముననున్న బుద్ధుడు వారలను చూడవచ్చెను. వారల తోటమాలి బుద్ధుని లోనికి రానద్దని చెప్పుచుండ అనురుద్ధుడు విని, తోటమాలిని ఆపి, తన సోదరులను పిలుచుకొని, బుద్ధుని యొద్దకు సమీపించి, వారికి నమస్కరించెను. ఒకడు బుద్ధుని కమండలమును గైకొనెను. ఒకడు పైవస్త్రమును తీసెను, ఒకడు పీట వేసెను. ఒకడు కాళ్లుకడుగు కొనుటకు నీళ్ళను, కాళ్ళుబెట్టుకొనుటకు మరొక పీటయు, తుడుచుకొనుటకు తువాలయు తెచ్చి యిచ్చెను. ఆపీటపై బుద్ధుడు కూర్చొని కాళ్లు కడుగుకొనెను. ఈ ముగ్గురును నమస్కరించి పక్కను కూర్చుండిరి. మీరు ముగ్గురును చక్కగా కాలము గడుపుచున్నారా ? భిక్ష సరిగా జరుగు

చున్నదా ? అని బుద్ధుడు వారల నడిగెను. ఏలోపమును లేదని వారు జవాబు చెప్పిరి. మీరు ఐకమత్యముతో, స్నేహ భావముతో, నీరు పాలవలె కలసి మెలసి ఉందురా? అని అని బుద్ధుడు అడుగ, నిశ్చయముగా అట్లే జరుగుచున్నదని వారు బదులుచెప్పిరి. మీరు యెట్లు ఐకమత్యమును సంపా దించితిరి అని బుద్ధుడు మరల ప్రశ్నించెను. దానికివారు ఒకరి తరువాత నొకరు యిట్లు జవాబు చెప్పిరి. ఇట్టి సోదరుల సాం గత్యముతో జీవించుట నాకు పూర్తిగాలాభకరము, నాకు పూర్తిగా ఆనందకరము అని నేనెంచెదను. అట్లుయెంచి రహ స్యముగాను, బహిరంగముగాను, నాపనుల అన్నిటిలో వారల యెడ సఖ్యత (చెలిమి)చూపెదను. అట్లే నామాటల లోను, నాయోచనలలోను, చెలిమి నిలిపెదను. నాకోరిక నువీడి యీపూజ్యులయిన సోదరుల కోరిక ప్రకారము యెం దుకు నడువరాదు అని ఆలోచించి అట్లే చేయుచుండెదను. మాశరీరములు వేరుగాని, మనస్సులు ఒకటే అయినవి. ఈమాటలు వినిన పిమ్మట బుద్ధుడు మరల యిట్లు ప్రశ్నిం చెను. మీరు నిష్ఠతోను, భక్తితోను, శ్రద్ధతోను, స్థిర చిత్తముతోను మెలగు చున్నారా ? దానికి అట్లే జరుగుచు న్నదని వారు బదులుచెప్పి, తాము అవలంబించు పద్ధతిని ఇట్లు వర్ణించిరి. మేము ముగ్గురమును గ్రామములోనికి భిక్షకు పోవు దుము. ఎవడు ముందుగావచ్చునో వాడు పీటవేయును. కాలి పీటలు,తువాళ్లు, వాడుకనీరు, మురికినీరు ఉంచుపళ్లెము తెచ్చి ఒకచోట పెట్టును. మంచినీళ్ళు, అన్నము వడ్డించును. చివ

రకు వచ్చినవాడు, తాను తినగోరిన మొదల మిగిలిన అన్నమును తినును. లేనియెడల యీ అన్నమును తీసి పారవేయును. పీటలు మొదలయినవి తీసి కడిగి శుభ్రముచేసి, యెక్కడి వక్కడ యుంచును. కుండలను, కుర్చీలను, అమర్చును. ఒక్కడు తియ్యలేనియెడల రెండవవాని పిలుచును. ఈపనులను గురించిమాకు మాటగా పలుకు లేనేలేదు. అయిదు రోజుల కొక్కమారు ఒక రాత్రియంతయు నిద్రలేకుండ కూర్చొని మతవిషయమై మాట్లాడుకొనుచు, బోధించు కొందుము. ఇట్లు మాజీవితము శ్రద్ధా భక్తులతో, స్థిరబుద్ధితో, సరళముగా జరుగుచున్నది. అనివారు బుద్ధునికి యెరుకపరచిరి. బుద్ధుడు వారలకు ధర్మసంభాషణ వినిపించి [illegible] హాము, సంతోషము వారలకు కల్పించెను.

—...—

## —౬ దేవదత్తుని కథ.

—...—

దేవదత్తుడు శాక్యజాతికి జెందిన క్షత్రియ కుమారుడు. ఈతడు అనురుద్ధుతోపాటు భిక్షువయ్యెను. ఈయన చేసిన సాధనమువల్ల కొన్నికొన్ని అణిమాదిశక్తులను సంపాదించినట్లు కనుపడును. (ఈ దేవదత్తుడును, బుద్ధుడును బాల్యమునందు ఆటలాడుచుండగా ఆకాశమును బారులుగట్టి పోవుచున్న పక్షులలో నొకదానిని ఇతడు బాణముచేతపడగొట్టెను. దానిని బుద్ధుడు తీసుకొని దాని రెక్కలను పరీక్షించి అలు

గును తీసి దానికి కొంతసేవచేసి బాధతగ్గించెను. దేవదత్తుడు ఆపక్షి తనదని వాదించెను. ప్రాణము హరింపజూచిన దేవదత్తునికి యీపక్షిని యివ్వరాదనియు, ప్రాణము రక్షించిన తనకే రావలయునని, బుద్ధుడు చెప్పెను. ఈ తగవు వారలకు తీరక వారు రాజసభకు పోయిరి. ప్రాణదాతకే హక్కుగలదని వారు తీర్మానించిరి. అంతట బుద్ధుడు దానిని బాధ తీరువరకు పోషించి పిమ్మట వదలివేసెను. ఆబాణముయొక్క అలుగును బుద్ధుడు తనశరీరములో గ్రుచ్చుకొని ఆపిట్టకు గలిగిన బాధను తాను స్వయముగా తెలుసుకొనెను.)

దేవదత్తుడు ఒకనాడు ధ్యానములోనుండగా నేను ఎవరిని స్నేహితునిగా జేసుకొనినయడల నాకు అధికముగ, లాభమును, కీర్తియును, గౌరవమును గలుగును, అను ఆలోచన తోచెను. అంతట మగధయువరాజు అయిన అజాతశత్రుని పేరు యతనికి తోచెను. యీతడు అజాతశత్రువును కలసి స్నేహము చేసెను. అజాత శత్రుడు యితనిని మిక్కిలి ఆదరించెను. ప్రతి ఉదయము, సాయంత్రము ఐదువందల భిక్షువులకు సరిపోయిన అహారమును దేవదత్తునకి యీతను పంపుచుండెను. ఇట్లు జరుగుచుండ కీర్తి కాంక్ష పెరిగెను. భిక్షు సంఘమున కంతకును నాయకుడు కావలెనను కోరికపుట్టెను. యీసంగతి మొగల్లానా అను బుద్ధుని శిష్యుడొకడుగ్రహించి బుద్ధునితో చెప్పెను. దీనిని నీమనసునందే యుంచుకొనుము. ఆ మూర్ఖుడు తనంతట తానే బైటపడును. అని బుద్ధుడు అతనికి సమాధానము చెప్పెను. మొగల్లానాతో బుద్ధుడు లోకస్థితిని

గూర్చి యిట్లు పలికెను. ఈ లోకములో ఐదు తరగతుల బోధకులు గలరు. ఒకడు సత్ప్రవర్తన లేనివాడు. ఒకడు సరియైన ఆహారనీమము లేనివాడు. యింకొకడు సరియైన ధర్మము లేనివాడు, యింకొకడు సరియైన జ్ఞానములేనివాడు, యింకొకడు సరియైన బోధనాశక్తి లేనివాడు. ఏయొక్క లోపమయినను గల గురువు తన శిష్యులును కలసి ఒండొరుల లాభము నిమిత్తము, తమతమ లోపములను కప్పిపుచ్చి ప్రపంచమును మోసగించవలసి యుండును. నాకు అయిదు లోపములును లేవు. నేను పవిత్రుడననియు, నిర్దోషిననియు, మాయా మర్మము లేనివాడననియు, బహిరంగముగా ప్రకటించుచున్నను, నాశిష్యులుగాని, యితరులుగాని, నన్ను కాపాడనవసరములేదు. అట్టి కోరికయును నాకులేదు. అని బుద్ధుడు చెప్పెను.

బుద్ధుడు కోశాంబినగరము వదలి, రాజగృహనగరము వచ్చెను. అచ్చటి భిక్షువులు దేవదత్తుని కీర్తినిగూర్చి బుద్ధునితో చెప్పిరి. దేవదత్తునిజూచి మీరు అసూయపడకుడు. అతడు అసమర్థుడయిన యెడల వీటివల్లనే అతను చెడిపోవును. అరటిచెట్టుగాని, వెదురుగాని, రెల్లుగాని పండుపండగానేచెడిపోవును. కంచరగాడిద ప్రసవించగనేచనిపోవును. అట్లేచెడువానికీర్తినశింపజేయును. అనిబుద్ధుడు వారలనుప్రబోధించెను.

ఒకనాడు సపరివారుడయిన మగధరాజుతో కూడ ఒక పెద్ద సభ జరుగుచుండెను. ఆనిండు కొలువులో కూర్చుండి బుద్ధుడు ధర్మము బోధించుచుండెను. అప్పుడు దేవదత్తుడు

లేచి బుద్ధునికి నమస్కరించి, "మీరు ముసలవారైతిరి. చాల దూరము జీవయాత్ర గడిపితిరి. చివరరోజులు వచ్చియున్నవి. కాన మీరు విశ్రాంతి గైకొనుడు. నేను బుద్ధసంఘమునకు నాయకుడనై నడిపెదను" అని బుద్ధునితో విన్నవించెను. "చాలును దేవదత్తా! నాయకత్వమును కోరకుము" అని బుద్ధుడు శెలవిచ్చెను. వాడు యిట్లు మరిరెండు పర్యాయములు కోరి అదేజవాబును పొందెను. అంతట బుద్ధుడు, "దేవదత్తా! నీవు దుష్టుడవు. నీకంటె శారిపుత్ర మొగ్గల్లాలు శ్రేష్టులు. నీకీ అగ్రత లేదు" అని తెలుపగా దేవదత్తునికి బుద్ధుని యెడ అసూయజనించెను. అతను పగపట్టెను. రాజుయెదుట తనకు అవమానము జరిగెనని దేవదత్తునికి కోపము వచ్చెను.

దేవదత్తుని స్వభావము మారినదనియు, దేవదత్తుడు చెప్పుమాటలలోగాని, చేయుపనులలోగాని, బుద్ధునకును, భిక్షుసంఘమునకును జవాబుదారీలేదనియు, సంఘమువారు తీర్మానించిరి. ఆతీర్మాన ప్రకారము రాజగృహనగరములో ప్రకటించవలసినదిగా శారిపుత్రుని కోరిరి. మొదట దేవదత్తుడు గొప్పవాడనియు, మంచివాడనియు, ప్రకటించితిని. ఇప్పుడు మరల నేనేబోయి వాడు చెడ్డవాడని యెట్లు చెప్పుదును. అని శారిపుత్రుడు అనుమానించెను. "శారిపుత్రా! మొదట నీవు నిజము చెప్పితివా? లేదా?" అని బుద్ధుడు అడిగెను. అప్పుడు నిజమే ప్రకటించితిని. అని శారిపుత్రుడు బదులు చెప్పెను. ఇప్పుడు నీవు ప్రకటించవలసిన సంగతి నిజమా? అబద్ధమా? అని బుద్ధుడు అడుగ యిదియు నిజ

మేనని శాలిపుత్రుడు ఒప్పుకొనెను. నిజమునే మార్పులుచు దేవదత్తుని స్వభావమును ప్రకటించును. అని బుద్ధుడు శాలిపుత్రుని సందేహము తీర్చెను. అంత శాలిపుత్రుడును, కొందరు భిక్షువులును, నగరములో నలుదెసలను దేవదత్తునిలో గలిగిన మార్పును యెరుకపరచిరి. కొందరు నమ్మి, దీనికి గొప్పకారణ ముండును అని తలచిరి. కొందరు దేవదత్తుని కీర్తికి ఓర్వక యిట్టి ప్రకటన జరుపబడెనని యెంచిరి.

దేవదత్తుడు ఒకనాడు అజాతశత్రుని యొద్దకుబోయి కాలములు మారినవి. ఆయుస్సులు తగ్గినవి. నీవు యీడు వచ్చినవాడవు. మీతండ్రి ఇంకను రాజ్యము చేయుచున్నాడు. నీవు రాజుగాకముందే చనిపోయెదవేమో! నీవు నీతండ్రిని చంపి రాజువగుము. నేను గౌతముని చంపి బుద్ధుడ నగుదును, అని సలహా చెప్పెను. ఆయువరాజు దాని కంగీకరించెను. వాడొకనాడు కత్తిని తొడదగ్గర దాచుకొని రాజు పడుండు గదిలోనికి పోయెను. అచటనున్నవారు యిట్టి వేళ గానివేళ వచ్చెడి వీని వైఖరిని జూచి అనుమానించి సోదా చేసి, కత్తిని బట్టుకొనిరి. దీనికి కారణమేమని అడుగ మా తండ్రిని చంపుటకే నేను వెళ్లుచున్నాను అని అతను జవాబు చెప్పెను. నిన్ను యెవరు పురికొల్పిరి అని అడుగ దేవదత్తుడు అని చెప్పెను. అప్పుడే అజాతశత్రుని చంపవలెనని కొందరు ఊహించిరి. కొందరు బుద్ధనిసంఘమును నిందించిరి. కొందరు దేవదత్తుని జంపదలంచిరి. కొందరు రాజునకు యీసంగతి యెరుకపరచి వారు చెప్పిన చొప్పున నడుతమనిరి. అందరును

కలసి వీనిని రాజుదగ్గరకు తీసుకొని పోయిరి. నన్నేల చంప నెంచితివి అని రాజు వాని నడిగెను. నేను రాజ్యమును కోరితిని అని వాడు చెప్పెను. నీకు కావలసినది రాజ్యమేకదా. ఇదిగో తీసికొమ్మని కిరీటము నిచ్చెను. అట్లు అజాతశత్రువు రాజయ్యెను.

దేవదత్తుడు యీ క్రొత్తరాజుచెంతకు వచ్చి, నేను గౌతముని చంపవలసియున్నది. కొందరు మనుష్యులను నేను చెప్పునది చేయునట్లుగా ఆజ్ఞాపించి నాకు స్తోమతున్నిమ్ము. అని కోరగా రాజు అట్లేచేసెను. అంతట దేవదత్తుడు తన వెంట వచ్చువారలను ఐదు ముఠాలుచేసి మొదట ఒక్కని, తరువాత ఇద్దరిని, తరువాత నలుగురును, తరువాత యెనిమిది మందిని, తరువాత పదహారు మందిని ముఠాలుగానుంచి కొన్ని కొన్ని చోట్ల నిలిపెను. ప్రతిముఠాతో మీరుపోయి బుద్ధుని చంపి యీదోవను తిరిగి రండు అని చెప్పెను. అట్లు తిరిగి వచ్చు ముఠాను చంపునట్లుకూడ యేర్పాటు చేసెను. మొదటి వాడొక్కడును, డాలును, కత్తిని, విల్లును, అంబును తీసుకొని బుద్ధుడుండు చోటికిబోయెను. దూరమునుండియే బుద్ధుని చూచి వీని దేహము వణకసాగెను. మనసు మారెను, తాను కదలలేక పోయెను. అప్పుడు వీని స్థితిజూచినబుద్ధుడు "స్నేహితుడా! ఇటురమ్ము. భయపడకుము. అని" చెప్పెను. వాడు తన ఆయుధములను అచ్చట పెట్టి బుద్ధుని దగ్గరకుపోయి వారి కాళ్ళమీదపడి తాను వారిని చంపుటకు వచ్చిన సమాచారము చెప్పెను. తన నేరమును ఒప్పుకొనెను. పశ్చాత్తాప

పడెను. ముందెన్నఁడును యిట్టిపని చేయనని ఒట్టు పెట్టు
కొనెను. బుద్ధుఁడు ఆతని క్షమించి ధర్మబోధచేసెను. వాఁడు
బుద్ధుని సంఘముఁజొచ్చి శిష్యుఁడాయెను. బుద్ధుఁడు ఆతనికి వాఁడు
వచ్చిన మార్గముగాక, మఱియొక తోవను పంపివేసెను.
వీనికై యెదురు చూచుచున్న కొండపైనున్నవారు వాఁడు రాలేదని
యోచించి తాము బయలుదేరి వచ్చి బుద్ధుని దర్శించి, బోధ
లను విని, శిష్యులై, వారు ఆజ్ఞ పొందిన చూపిన మార్గమున
వెళ్ళిపోయిరి. ఈవిధముగానే తక్కిన ముఠాలకును జరిగెను.
మొదటివాఁడు దేవదత్తునిచేరి బుద్ధుని మహిమ గొప్పది, నేను
వారిని చంపజాలకపోతిని, మీరు యెన్నఁటికిని చంపఁబూనను,
అని చెప్పెను. అంతట దేవదత్తుఁడు ఆపనిని తానే స్వయముగా
చేయఁబూనెను. ఒకనాఁడు బుద్ధుఁడు ఒక కొండకడను ధ్యాన
ములోనుండి, యిటు నటు తిరుగుచుండెను. అది కనిపెట్టి దేవ
దత్తుఁడు కొండమీఁదికి యెక్కి, బుద్ధునిమీఁద పడునట్లుగా ఒక బండను
దొర్లించెను. ఆబండజారునపుడు యింకొక బండకు తగిలి బద్దలై
ఒక చిన్నముక్క వచ్చి బుద్ధునికాలికి తగిలి కాలు నెత్తురుకాఱెను.
సమాధినుండి లేచిన బుద్ధుఁడు పైకి దేవదత్తునివైపు చూచి, ఓరీ
మూర్ఖుఁడా! యెంత పాపమును సంపాదించితివి. తథాగతుని చంప
దలచి, వాని నెత్తురు కార్చితివి అని అనెను. అంతట తనను చూడ
వచ్చిన శిష్యులతో, ఈకర్మఫలితమును దేవదత్తుఁడు ఈజన్మము
లోనే అనుభవించునని సూచించెను. కొన్ని కర్మలఫలితము
ముందుజన్మలలోను, కొన్నికర్మలఫలితము ఈజన్మమునందు అనుభ
వించవలసియుండునని వారి సిద్ధాంతము.

ఈ వార్తవినిన భిక్షువులు బుద్ధుడువుండు విహారము చుట్టును కాపలాకాయుచు, బిగ్గరగా పాటలుపాడుచు, గట్టిగా మంత్రములు చదువుచుండిరి. బుద్ధుడు వారలను పిలిపించెను. అందరును కూర్చున్న పిమ్మట బుద్ధుడు ఇట్లుబోధించెను."భిక్షువులారా! తథాగతునియొక్క ప్రాణమును యెవరును దౌర్జన్యముచేత తీయజాలరు. అది అసాధ్యము. తాముగాక ఏఇతరుడు మొదలిడిన పనివలనను తథాగతుడు చంపబడడు. పండు పండి తథాగతుడు రాలిపోవును, తథాగతునికి ఏ కాపలాయును అక్కరలేదు. కానమీరు మీమీ గదులలోచేరి మీమీ పనుల చూచుకొనుడు."

రాజగృహ నగరములో నాలాగిరి అను ఒకఏనుగ గలదు. అది క్రూర జంతువు. మనుజులను చంపును. దేవదత్తుడు మావటివాని వద్దకుబోయి బుద్ధుడు ఈ రస్తానువచ్చును. వాని మీద దీనిని వదలుము. మీకు జీతభత్యముల యెక్కువ చేయించెదను. అని చెప్పగా ఆమావటివాడు సమ్మతించెను. ఒకనాటి ప్రొద్దున బుద్ధుడు కాషాయములనుకట్టుకొని, కమండలము చేపట్టి, భిక్షువులతో కలసి భిక్ష మెత్త బయలుదేరెను. ఆ త్రోవనే వచ్చుచుండెను. మావటీడు నాలాగిరి యను యేనుగును బుద్ధుని మీద వదలెను. భిక్షువులు అందరును బుద్ధుని యొద్దకు పరుగెత్తి, ప్రభో! తొలగుడు, మరలుడు, అనికేకలు వేసిరి. భిక్షులారా! రండు పోదము,భయపడకుడు తొలగనవసరము లేదు, అనిబుద్ధుడు చెప్పి, ఆదోవనే పోవు చుండెను. భిక్షువులు యెన్నిమారులు బ్రతిమాలినను, ఆయన

వినఁబడాయెను. పట్టణములోని ప్రజలు మిద్దెలమీఁదను, మేడల
మీఁదను నెక్కి చూచుచుండిరి. ఈ సుందరమైన శ్రమణుఁడు
(భిక్షువు అనఁగా బుద్ధుఁడు) ఈయేనుఁగవలన చనిపోవునని కొం
దరు తలఁచిరి. మానవులలోని యేనుఁగ అయిన బుద్ధునితో
ఆయేనుఁగ గెలువలేదని కొందరు నమ్మిరి. ఇంతలో నాలాం
గిరి అనే యేనుఁగ బుద్ధుని చేరవచ్చె. బుద్ధుని ప్రేమ [illegible]
ఆ యేనుఁగ మీఁద ప్రసరించెను. అది తొండమును వంచి
బుద్ధుని యొద్దకు వచ్చి నిలచెను. అప్పుడు బుద్ధుఁడు ఆయేనుఁగు
తలపై తన కుడిచేతినిపెట్టి దానికిబోధించెను. "ఏనుఁగా మాన
వులలోని యేనుఁగను తాకకుము. అట్టిదాడి దుఃఖమును
కలిగించును. దానివలన యెన్నటికిని ఆనందము కలుగదు.
మదమున ప్రమాదమును పొందకుము. ఇవి ఆనందమునకు
అడ్డు తగులును. నీవుగూడ ఆనందమును పొందుటకు [illegible]
ప్రవర్తించుము. ఆమాటలు విని నాలాగిరి అను యేనుఁగ
బుద్ధుని పాదములక్రింద దుమ్మును తొండముతో నెత్తి, దాని
తలపై వేసుకొని బుద్ధునిపై దృష్టినిలిపి వెనుకకు నడచెను.
అప్పుడు పట్టణములోని జనులు "కర్రలు, కొరడాలు, అంకు
శములు లేకుండగనే, యీ మహానుభావుఁడు, యీయేనుఁగను
మచ్చిక చేసుకొనెను." అని వేనోళ్ళ పొగడిరి. ఈచర్యలు
అన్నిటికిని దేవదత్తుఁడే కారకుఁడు అని తెలుసుకొని వానిపై
ప్రజలు కోపమును బూనిరి.

అప్పుడు దేవదత్తుఁడు తిరిగి భిక్షుసంఘములో చీలికలు
కలుగచేయుటకు ప్రయత్నము చేసెను. కొకాలికుఁడు మొద

లగు వారిని చేర్చుకొని కుట్రచేసెను. బుద్ధునికి ఐదు అంశ
ములతో సందేశము పంపెను. అందులోని అంశములు యివి.
౧ భిక్షువులు యెప్పుడును అడవులలో యుండవలెను గాని
గ్రామముల దగ్గరకయినను రాకూడదు. ౨ ఎప్పుడును బిచ్చ
మెత్తవలసినదేగాని, యెవరి పిలుపును అంగీకరించి వారి ఇం
డ్లలో భిక్ష తీసికొనరాదు. 3 ఎప్పుడును పారవేసిన గుడ్డలనే
కట్టవలెను గాని ఉపాసకులు యిచ్చిన దుస్తులను తీసుకొన
రాదు. ౪ ఎప్పుడును చెట్టుమొదట నిద్రించవలసినదేకాని
కప్పుక్రింద తలదాచుకొనరాదు. ౫ వారు యెన్నడును చేపల
తినకుండుట మంచిది. ఈ ఐదింటిలో బుద్ధుడు చేయు తీర్మా
నము దేవదత్తునికి తెలియును. బుద్ధుడు వీనిని త్రోసి వేసిన
యెడల ప్రజలవద్దకు వెళ్లి బుద్ధునిపై తిరుగుబాటు చేయించు
టయే వీని యభిప్రాయము. దేవదత్తుడును, వాని మిత్రులును
బుద్ధుని యొద్దకుబోయి యీ యంశములను చెప్పిరి. మొదటి
మాటికిని బుద్ధుడు యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. ఇష్టమైన
వాడు అడవులలో యుండవచ్చును. బిచ్చమెత్తవచ్చును. పార
వేసిన పీలికల కట్టవచ్చును. ఇష్టమైనవాడు గ్రామసమీప
మునందుండవచ్చును. గృహస్థుల యిండ్లలో భిక్ష గైకొన
వచ్చును. దుస్తులను, దానమును పట్టవచ్చును. చెట్టుక్రింద
నివశించుటనుగూర్చి యెనిమిది నెలలు అన్నిభిక్షువులు నివసిం
చుచున్నారనియు, వానకాలములో నాలుగు నెలలు తలదాచు
కొనక తప్పనిసరియనియు చెప్పెను. తనకయి పట్టబడినట్లు
తాను చూడక వినక, అనుమానించక వున్నవాడు చేపలను

తినినను, తినవచ్చును, అని సూచించెను. ( ఈచేపలను తినుటనుగూర్చి ఇది బుద్ధుని అభిప్రాయము కాదనియు,తర్వాత వారు ప్రవేశపెట్టిరనియు, ఊహించుటకు తగిన కారణములు గలవు. జైనమతుల ప్రకారం తినినను, జీవహింస ప్రోత్సాహ పరచబడును. ) దేవదత్తుడు తాను అనుకొనినట్లు జరిగినదని సంతసించి రాజగృహనగరులో బుద్ధుని బోధకును, ఆచరణ మునకును భేదము గలదనియు, తానును, తన స్నేహితులును, అత్యల్పముతో తృప్తిబొందుచుండ, బుద్ధుడు భోగమునకు అవకాశమిచ్చుచున్నాడనియు, ప్రజలయందు ప్రచారముచేసి దురభిప్రాయముపుట్టించ యత్నముచేసెను. ఈసంగతి బుద్ధునికి తెలియగానే భిక్షువులసంఘసభజరిపి దేవదత్తుని ఆసభలో నీవు సంఘములో కక్షలు కల్పించుచుంటివా ? అని అడిగెను. దేవదత్తుడు తన ఉద్దేశ్యమును ఒప్పుకొనెను. దేవదత్తా! చాల దూరము పోతివి. సంఘములో కక్షలు కలుగుట మేలుగా నీకు తోచకుండుగాక! అట్టికక్ష దుఃఖకరము. శాంతముగా నున్న సంఘము యెవడు విభజించునో వాడు పెద్ద తప్పిదము చేయు చున్నాడు. కక్షలుగల సంఘములో యెవడు శాంతిని నెల కొలుపునో వాడు ఉత్తమమయిన పుణ్యముచేయుచున్నాడు. దేవదత్తా! చాలును. ఇదివరకే చాలదూరము పోతివి. చాలును అని బుద్ధుడు చెప్పెను.

దేవదత్తుడు అంతటితో తృప్తిపొందలేదు. మరునాడే ఆనందుడను, బుద్ధుని శిష్యునితో నేటినుండి తానును, తన అనుచరులును వేరుగా సభలు జరుపుదుమనియు, బుద్ధునిజో

క్యము తనకు అవసరములేదనియు చెప్పెను. రాజగృహనగరములో తన భిక్షను పూర్తిచేసుకొని, ఆనందుడు తిరిగివచ్చి బుద్ధునకు యీ వార్త తెలిపెను. మంచివానికి మంచిపని తేలికయు, చెడువానికది కష్టమును అగును. చెడుపని చెడువానికి తేలికయు ఉత్తములకు కష్టమును అగును. అని బుద్ధుడు అప్పుడు వచించెను.

ఆనాడేఉపోసథమనువ్రతముజరుగుచుండెను. తానును తన స్నేహితులును, బుద్ధునికి ఐదు సంస్కరణములు చేయుట అవసరమని తెలిపితిమనియు, కాని బుద్ధుడు అందుకు అంగీకరించలేదనియు, ఆమార్పులప్రకారమే తాము జీవితములు గడుపుచున్నామనియు, ఆమార్పులను అంగీకరించువారెల్ల తనవద్ద సమ్మతిపత్రములను(ఓటింగుచీట్లు) తీసుకొనవలెననియు దేవదత్తుడు ఆసభలో తెలిపెను. క్రొత్తగా భిక్షువు లయిన ఐదు వందలమంది దేవదత్తుని ఉద్దేశ్యమును గ్రహించలేక అతడు చెప్పునది ధర్మమేనని పొరబడి దేవదత్తునియొక్క చీట్లు తీసుకొనిరి .ఆఐదువందల భిక్షువులు దేవదత్తునితో వెడలిపోయిరి. ఈసమాచారము బుద్ధునికి తెలిసెను. ఆవెడలిపోయిన ఐదు వందలమంది భిక్షువులపై ఆయనకు కరుణ గల్గెను. వారు మోసపోయి పూర్తిగా నాశనముగాకముందు వారలకు నిజస్థితిని తెలుపుడని శారిపుత్రమొగ్గల్లానలను బుద్ధుడు హెచ్చరించెను. వారు సరేనని యీ దేవదత్తుడుండు చోటికి వెడలిరి. వీరు చేరునప్పటికి దేవదత్తుడు తన ముఠాకు బోధించు చుండెను. వీరిని చూచి తన సిద్ధాంతమును వీరుకూడ అంగీక

రించిరనియు, తనతో చేరుదురనియు, తలచెను. కాని వారి కట్టి అభిప్రాయము కలుగదని, కోకాలికుడు దేవదత్తునితో చెప్పెను. దేవదత్తుడు వీరలను ఆదరించి శారిపుత్రునకు తన అర్ధాసనము యిచ్చెను. శారిపుత్రుడు అది అంగీకరించక వేరొకచోట కూర్చుండెను. దేవదత్తుడు తనబోధ ముగిసిన పిమ్మట శారిపుత్ర మొగ్గల్లానలను బోధించుమని కోరెను. వారు బోధచేయుచుండ తాను నిద్రించెను. శారిపుత్రుడు, మొగ్గల్లానాయును ధర్మముయొక్క ప్రభావమును గూర్చియు, సాధన యొక్క మహిమనుగూర్చి, బోధించిరి. వినుచుండిన వారలకు ధర్మముయొక్క నిజస్థితి నెరిగెను. జన్మమెత్తిన ప్రతివస్తువును నశించక తప్పదని వారికి గోచరించెను. వారందరును శారిపుత్ర మొగ్గల్లానల వెంట బుద్ధునియొద్దకు వచ్చిచేరిరి.

అప్పుడు కోకాలికుడు, దేవదత్తునినిద్రలేపెను. శారిపుత్ర మొగ్గల్లానాలు ఐదువందల భిక్షువులను తీసుకొనిపోయిరని తెలిపివారలను నిందించెను. దేవదత్తుడప్పుడే వేడినెత్తురు కక్కుకొనెను. అప్పుడే అక్కడనే దేవదత్తుడు చనిపోయెను తరువాతగాధలు తెలుపుచున్నవి. ఈ వచ్చిన ఐదువందల మంది భిక్షువులును తాము పొరబడితిమనియు, తమ పొరబాటునకు చింతిల్లుచున్నామనియు బుద్ధునికి మనవిచేసిరి. వారి పశ్చాత్తాపమును అంగీకరించి వారలను బుద్ధుడు సంఘములో చేర్చుకొనెను.

దేవదత్తుడు లాభమును, గౌరవమును, కీర్తిని గోరెను. ఆకోరికలను వానిమనసు లొంగిపోయెను. దుష్టమైన కోరిక

లకును, దుష్టమైన స్నేహితులకును, వాడు చిక్కెను. అం దుచేత ఆతడు, బాధను, దుఃఖమును పొందెను. ప్రతివాడును, లాభమును, నష్టమును కీర్తిని, అపకీర్తిని, గౌరవమును, అగౌరవమును, అనువానికి లొంగక అతీతుడు కావలెను. దుష్టమైన కోరికను, దుష్టమైన స్నేహితులను విడువలెను. ఇట్లు విడువనివారికి ఆసవములు నశించవు. వారికి సాధన కష్టమగును. కాన వీటికి మీరు అతీతులయి సాధనచేయుడు. మన మందరము యీయెనిమిదింటిపై సంపూర్ణమైన జయమునుపొందవలెను. దేవదత్తుడు తాను బొందిన అల్పమైన, అణిమాది స్థితులతో గర్వించి, ఉన్నతమయిన అర్హతుని లక్షణములును నిర్వాణమును పోగొట్టుకొనెను. సముద్రమువలె అంతము లేనట్టియు, గంభీరమైనట్టియు, తథాగతునికి తన మాటలచే హాని చేయ యత్నించెను. కాని శాంతమైనట్టియు, సంపూర్ణమైనట్టియు తథాగతునిపయి యీమాటలు వృథాయయ్యెను.అని బుద్ధుడు భిక్షువులనెల్ల ప్రబోధించెను.

—...—

## —౯ సముద్రము కథ. ౯—

—...—

ఒకనాడు భిక్షువులందరును శ్రావస్తీనగర సమీపమున విశాఖ కట్టించిన భవనములో సభ జేయుచుండిరి. బుద్ధుడచట నుండెను. ఆసభయెదుట బోధించమన్న ఆనందుడు బుద్ధుని కోరెను. బుద్ధుడు మౌనము వహించెను. మరి మరి,

వేడగా యీ సభ అపవిత్రమయినది ఆనందా! అని బుద్ధుడు చెప్పెను. అంత మొగ్గల్లానా యెవరిని గురించి స్వామి చెప్పుచున్నారని యోజించి, సభ యంతయు కలయజూచినపుడు ఒకని దగ్గరకువచ్చి, అయ్యా లెమ్ము. బుద్ధుడు నిన్ను కనుగొనెను. ఇటనుండి వెడలుము. అని చెప్పెను. అతడు ఊరకపోగా మొగ్గల్లానా వానిని చెయ్యిపట్టుకొని బయటికి తీసుకొనిపోయి విడిచి వచ్చెను. అంతట బుద్ధుడు భిక్షువులతో యిట్లు ప్రసంగించెను. భిక్షువులారా! మహాసముద్రములో చిత్రమైన ఆశ్చర్యకరమయిన యెనిమిది గుణములు కలవు. ౧ ఆసముద్రము పోనుపోను మెల్లగా లోతగుచుండును. ఒక్కసారే అగాధముగా నుండదు. ౨ ఈసముద్రము అచలమయి తన స్వభావమును వీడకుండును; యెన్నడును చెలియలికట్ట దాటదు. ౩ ఈ మహాసముద్రము యెన్నడును శవముతో స్నేహము చేయదు. ఎప్పుడయినను ఒకశవము అందులో పడిన యెడల దానిని వెంటనే యొడ్డునకు నెట్టివేయును. ౪ గంగా, యమునా, అచిరావతి, శరభు మహీ, యిట్టినదులు అనేకములు యీసముద్రములో పడగానే వాని వాని పేర్లను, వంశనామములను, పోగొట్టుకొని సముద్రములో లీనమగును. ౫ ప్రపంచములో యెన్నినదులు వచ్చి ఈసముద్రములో పడినను ఆకాశమునందలి వాన అంతయు దీనిలో కురిసినను, ఈసముద్రము ఒక్కింతయయినను పొంగదు. ఒక్కింతయు తరుగదు. ౬ ఈసముద్రమునకు ఒక్కటేరుచి. ఉప్పగానుండును. ౭ ఆసముద్రములో రత్నములు, వజ్రములు, వైడూర్యములు, ముత్యములు,

వెండి, బంగరు మొదలగునవి యుండును. అయ్యాది రత్నగర్భ. ౮ తిమి. తిమింగలము, తిమి తిమింగిలము, అసురులు, నాగులు, గంధర్వులు మొదలగు మహారూపులు యిందులో ఉందురు. అట్లే యీధర్మములోయెనిమిది అత్యద్భుతములయిన సుగుణసంపదలుగలవు. ౧. సముద్రమువలెనే ఈధర్మమువరుస క్రమేణ, సాధనముపెంచి మెట్టుమెట్టుగా సాధకుని వున్నతస్థితికి తీసుకొనిపోవును. ఒడు దుడుకు యెన్నడును లేదు. ౨ సముద్రమెట్లు అచలమయి చెలియలికట్టదాటదో అట్లే నేను చేసిన నియమములను నాశిష్యులు దాటరు. ౩. సముద్రములో శవమెట్లు నిలువదో అట్లే దుష్టుడు నామతములోనుండ నేరడు. శీల ప్రవర్తనములు చెడినవాడుగాని, అనుమానించదగినవాడు గాని, కామములతో నిండియుండిన వ్యర్థుడు గాని యీ సంఘములో నిలువజాలడు. సంఘము మధ్యను కూరుచున్నను, వాడు సంఘమునకు దూరుడే. మహానదులువచ్చి సముద్రములోపడి తమపేరుప్రఖ్యాతుల నెట్లు కోలుపోవునో, నాలుగు వర్ణములవారును (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు)లందరును ఈ దీక్షను వైకొనగానే తమ కులములను పేర్లను విడనాడి శాక్యపుత్రీయ శ్రమణులగుదురు (శాక్యపుత్రుడగు బుద్ధునిచే బోధింపబడిన శ్రమణులు లేక సన్యాసులు) ౫. ప్రపంచములోని నదులు అన్నియును, ఆకాశములో వాన అంతయును, సముద్రములో చేరినను, హెచ్చుతగ్గులు యెట్లు లేవో, అట్లే యెంతమంది భిక్షువులు వచ్చినను, యెంతమంది భిక్షువులు పోయినను యీ సంఘమునకుగాని, ధర్మమునకు

గాని లోపము రానేరదు. ౬. సముద్రమునకు యెక్కడ చూచినను ఎప్పుడు చూచినను యెట్లు ఒకేరుచిగలదో అట్లే యీ ధర్మమునకును, యీసాధనకును, ఒకే రుచి గలదు. అదియే విమోచనరుచి. స్వాతంత్ర్య రుచి. మోక్షరుచి. ౭. సముద్రములో యెట్లు వజ్ర, వైడూర్యములు గలవో అట్లే యీ ధర్మములో నాలుగు ధ్యానములు, నాలుగు పంథాలు, ఐదు నైతిక యింద్రియములు, ఏడు జ్ఞానములు, మొదలగు రత్నములు గలవు. ౮. ఎట్లు సముద్రములో తిమి తిమింగిలములు మొదలగు మహాకాయులు గలరో అట్లే యీ దులో బుద్ధులు బోధిసత్వులు, అర్హంతులు మొదలగు మహానుభావులు గలరు. ఈలక్షణము లన్నిటిని తెలిసికొని భిక్షువులందరును యీసిద్ధాంతములోను, యీసాధనములోను ఆనందింతురు.

---

## మహాప్రజాపతి గౌతమి కథ.

---

ఆకాలములో బుద్ధుడు కపిలవస్తు నగరమున మఱ్ఱివనములో నుండెను. ఆయనను పెంచి, పెద్దవానిని చేసిన సవతి తల్లి ఆయనవద్దకువచ్చి నమస్కరించి ఒక వైపున నిలుచుండి యిట్లు మనవి చేసెను. తథాగతులు ప్రకటించుచున్న సిద్ధాంత సాధనములలోనికి స్త్రీలనుగూడ గృహస్థాశ్రమము విడిపించి భిక్షువులుగా చేర్చుకొనిన యెడల బాగుండును ప్రభో!

ఆమాటలు విని, " గౌతమీ ! చాలును. స్త్రీలకు యిట్టి అనుమతి నిమ్మని అడుగు కోరిక నీకు కలుగకుండుగాక. " అని బుద్ధుడు చెప్పెను. కాని గౌతమి తృప్తి బొందక రెండవ మారు, మూడవమారు అట్లే వేడుకొనెను. బుద్ధుడు మొదటి మాటనే మరల చెప్పెను. అంతట గౌతమి బుద్ధునికి ప్రదక్షిణము చేసి కన్నీళ్ళు కార్చుచు వెడలి పోయెను.

కొన్నాళ్ళకు బుద్ధుడు వేసాలీ నగరసమీపమున మహావనములో ఉండెను. అప్పుడు మహాప్రజాపతి గౌతమియును, శాక్యస్త్రీలుకొందరును, తమ వెంట్రుకలను కత్తిరించి కాషాయములనుకట్టి, కాలినడకను బయలుదేరి, పుండ్లుబడిన కాళ్ళతో, దుమ్ముకప్పిన మొగములతో, నీరుకారిన కండ్లతో శోకమూర్తులవలె మహావనముయొక్క సింహద్వారము వద్దకు వచ్చి నిలువబడిరి. వారలనుచూచి ఆనందుడు మీరేల యిట్లు దిగాలపడి నిలిచితిరని గౌతమిని అడిగెను. ఆనందా ! బుద్ధభగవానులు మేము భిక్షువులు అగుటకు సమ్మతించ లేదు గదా! మేమువేమిచేయము అనిరి. అంతటఆనందుడు బుద్ధుని యొద్దకుచేరి, ఈ స్త్రీల సమాచారము చెప్పి వారుకోరినట్లు అనుమతించవలెనని వేడుకొనెను. ఆనందా ! చాలు, స్త్రీలను చేర్చవలెనను కోరిక నీకు గలుగకుండుగాక, అని బుద్ధుడు శెలవిచ్చెను. ఆనందుడు మరి రెండుమారులు అడిగి యిట్టి జవాబునే పొందెను. అప్పుడు వానికి మరియొక అలోచన తోచెను. ప్రభో! గృహస్థ జీవితమును విడిచి భిక్షువు మార్గమునుత్రొక్కిన స్త్రీలకు సంస్కార ఫలితముదక్కునా?

అర్హంతులుగాని శ్రోతాపన్నులుగాని, బుద్ధులుగాని కాగలరా. అని ఆనందుడు బుద్ధుని ప్రశ్నించెను. వారి కాశక్తి కలదని బుద్ధుడు చెప్పెను. ప్రభూ! అట్టి శక్తియున్న యెడల తమకు పెంచి పోషించి అధికముగా సేవ చేసిన గౌతమికి ఈ అనుమతి నిచ్చుట మంచిది. అని ఆనందుడు సూచించెను. అప్పుడు బుద్ధుడు స్త్రీలకు దీక్షనిచ్చుటకు సమ్మతించి కొన్ని నియమముల నేర్పరచెను. ౧ భిక్షువులైన స్త్రీలు వయస్సుతో నిమిత్తములేకుండ భిక్షువులైన పురుషులను గౌరవించవలెను. ౨, పురుషభిక్షువులు లేని జిల్లాలో ఆడభిక్షువులు చాతుర్మాస్యలు జరుపరాదు. 3. భిక్షుసంఘములో జరుగు కొన్ని పనులను గూర్చి ప్రత్యేకవిధులు యేర్పరచబడెను. ౪. స్త్రీలు భిక్షువులు కాగోరిన యెడల రెండు సంవత్సరములు తర్బీతు కావలెను. పురుషభిక్షువులను ఆడభిక్షువులు నిందించరాదు. ఈ నియమములు యేర్పరచబడినట్లు ఆనందుడు గౌతమికి తెలిపెను. ఆమె యీ నియమములన్నిటిని శిరసావహించెను. మొట్టమొదట బుద్ధుడు యేర్పరచిన నియమములను కొన్నిటిని పిమ్మట బుద్ధుడే మార్చెను. ఈ సందర్భమున బుద్ధుడు యిట్లు ఆనందునితో చెప్పెను. ఆనందా! యీ దీక్షలోనికి స్త్రీలు భిక్షువులై చేరకుండిన యెడల యీ మతము వేయి సంవత్సరములవరకు పవిత్రముగా, స్థిరముగా నుండెడిది. కాని యిప్పుడు స్త్రీలు భిక్షువులు అగుటకు అనుమతించబడినది గనుక యీ ధర్మశాసనము అయిదువందల సంవత్సరముల వరకు నిలుచును. ఇట్లు అనుమతి నిచ్చుటవలన

యేచిక్కులు కలుగకుండుటకై నీమముల నేర్పుచితిని. అని బుద్ధుడు చెప్పెను.

మొట్టమొదట మహాప్రజాపతీ గౌమి దీక్షను పొందెను. తరువాత ఆమెతో వచ్చిన స్త్రీలందరికి దీక్ష యివ్వబడెను. స్త్రీలకును, పురుషులకును, సమానమయిన నీమములలో ఉభయులు సమానముగా వర్తించవలెననియు, ఎవరి ప్రత్యేక నియమములో వారు ప్రత్యేకకృషి జరుపవలెననియు బుద్ధుడు నియమించెను. స్త్రీ భిక్షువుల సంఘము వేరుగను, పురుషభిక్షువుల సంఘము వేరుగను, యేర్పరచెను. ఒకనాడు గౌతమి ధ్యానము చేయుటకు సాధన చూపుమని బుద్ధుని కోరెను. అప్పుడు బుద్ధుడు ఆమెకు యిట్లుబోధించెను. గవుతమీ! దేనివలన ఉద్రేకముకలుగునో, కోరికలు పెరుగునో గర్వముపుట్టునో జనులమధ్యనుండవలెనని కోరికఉదయించునో, సోమరితనము యేర్పడునో, తృప్తికలుగదో అదిధర్మముకాదు. వినయము కాదు. తథాగతుని బోధయు కాదు. అనిజ్ఞాపకము ఉంచుకొనుము. ఉద్రేకమునకు బదులు శాంతియును, గర్వమునకుబదులు పూజ్యభావమును, అమిత కోరికలకు బదులు అల్పకోరికలును, గుంపులో నుండుటకు బదులు ఒంటరిగానుండుటయును, ప్రమాదమునకు బదులు శ్రద్ధానిష్టలును, అతృప్తికి బదులు తృప్తియును, దేనివల్ల కలుగునో అదియే వినయము. అదియే ధర్మము. అదియే తథాగతుని బోధ అని మనసు స్థిరపరచుకొనుము. ఆప్రబోధమును విని గౌతమి మిక్కిలి సంతసించెను.

భిక్షువులగు స్త్రీలుగాని, పురుషులుగాని, నియమములకు భిన్నముగా నడిచిన యెడల వారలకు ఒకేవిధమయిన ప్రాయశ్చిత్తము యేర్పరుచబడెను. స్త్రీ సంఘము తోడను గౌతమియే, బుద్ధుని యొద్దకు వెళ్ళి కష్ట సుఖములను చెప్పుచుండెడిది. స్త్రీల విధను, పురుషుల వలెనే భిక్షులు కావలెనే ప్రాతిమోక్షపాఠము, ఋతువుల నిర్ణయించుట, తిథుల నిర్ణయించుట, చంద్రుని గమనమును గ్రహించుట మొదలగునవి నేర్చుకొనవలసి యుండెను. స్త్రీలును పురుషులవలె వినయమును, ధర్మమును, సూత్రములను చదువుచుండిరి. ఒకనాడు సంఘ కష్టులుగా యేర్పడిన భిక్షువులయెడ తామెట్లు ప్రవర్తించవలెనని గవుతమి బుద్ధుని అడిగెను. "నేను చెప్పెడి ధర్మమును వినుము. అది వినిన పిమ్మట ఇతరులో నెవరి ఉపదేశములు విశ్వాసములు, సిద్ధాంతములు, వినయమునకు, ధర్మమునకు అనుకూలముగా నుండునో వారి పక్షమును అంగీకరించుము. నీకు కావలసిన సాయమును వారివలననే పొందుము" అని బుద్ధుడు ఆమెకు ఆనతిచ్చెను.

బుద్ధుడు సిద్ధిబొందిన పిమ్మట రాజగృహ నగరములో ఐదువందలమంది భిక్షువులు ఒక మహాసభ చేసిరి. అందులో బుద్ధుడు చెప్పియున్న వినయమును, ధర్మమును స్థిరపరచిరి. ఆ సభలో ఈ గవుతమిని, యితర స్త్రీలను భిక్షువులుగా చేర్చినందుకు, ఆనందునిపై కొందరు కోపపడిరి. అది తప్పు అని ఒప్పుకొమ్ము అని ఆనందుని కోరిరి. అప్పుడు ఆనందుడు యిట్లు జవాబు చెప్పెను. ఆస్త్రీలకు అనుమతిని పొందుటకు కారణ

మున్నది. భగవంతుడయిన బుద్ధుని తల్లి చనిపోగా ఆమె చెల్లెలు మహాప్రజాపతి గవుతమి ఆయనకు దాదియై, తల్లియై చనుబాలు యిచ్చి పెంచి పెద్దవానినిచేసెను. ఆమె బుద్ధునికి చేసిన సేవయును, దీక్షపొందుటకు గల భక్తిని గ్రహించి నేను ఆమెకై సమ్మతినివేడితిని. అందులోతప్పిదముయేమియు లేదు. కాని పెద్దలగు మీరందరును తప్పని యెంచిన యెడల నేను తప్పని ఒప్పుకొందును. ఆనందుడు యిట్లు చెప్పిన మీదట అంతటితో ఆవిషయమును ఆపిరి. కాని స్త్రీలకు మాత్రము క్రొత్తనిషేధములను యేవియు యేర్పరచలేదు.

—...—

## —అ నా థ పిం డి కు ని క థ.—

—...—

రాజగృహనగరములోని పెద్దశ్రేష్టికి ఒక చెల్లెలు వుండెను. ఆచెల్లెలును శ్రావస్తీనగరములోని అనాథపిండికునకు యిచ్చిరి. ఒకనాడు అతడు అత్తవారి యింటికి వచ్చెను. ఆ నాడు తన భావమరది పనుల తొందరలోనుండి యితనితో చాలసేపు కులాసాగా మాటలాడ వీలుపడలేదు. ఎప్పుడు అనాథపిండకుడు వచ్చినను యీపెద్దశ్రేష్టి అన్నిపనులనువదలి అతనితో కాలము గడుపుచుండును. నేడు అట్లు జరుగకుండుటకు కారణమేమి. యితని యింట పెండ్లిజరుగునా, యాగము జరుగునా, మగధరాజు విందునకు పిలిచెనా అని తనలో తాను అనుకొన జొచ్చెను. ఇంతలో పెద్దశ్రేష్టి యెవరి పనులను వారలకు జెప్పి అనాథపిండికునివద్దకువచ్చి ఆదరించెను.

ఏమి తొందరలో నున్నావు. పెండ్లియా, యాగమా, రాజు
నకు విందా అని అడుగగా, పెండ్లి ప్రసక్తి లేదనియు, రాజును
పిలువలేదనియు, కాని ఒక యాగము తలపెట్టితిననియు,
ఆతడు చెప్పెను. భిక్షుసంఘమును వారి గురువగు బుద్ధుని
రేపు మాయింటికి భిక్షకు పిలిచితిని. అని పెద్ద శ్రేష్ఠి చెప్పెను.
అనాథపిండికుడు త్రుళ్లిపడి యేమి! బుద్ధుడు అంటివా అని అడి
గెను. ఔను బుద్ధుడు అనే అంటిని. బుద్ధునినే పిలిచితిని. అని
శ్రేష్ఠి చెప్పెను. ఈప్రపంచములో బుద్ధుడు అను పదమువినుట
కష్టమే. అట్టివాడు ఒకడుండి ఆయన స్వయముగా మా యిం
టికి భిక్షకు వచ్చుట యెంత అదృష్టము. నేనుయిప్పుడేపోయి
ఆ అర్హంతుని. ఆభగవంతునిఆస్వయం బుద్ధుని, చూచెదను. అని
అనాథపిండికుడు ఆతురపడెను. కాని ఇదివేళకాదనియు, తెల్ల
వారగానే పోవచ్చుననియు, శ్రేష్ఠి వానికి తెలిపెను. అనాథపిండి
కునకారాత్రి నిద్రయే పట్టలేదు. తెల్లవారినదని ముమ్మారు
లేచెను. కాని యింకను చీకటుండెను. చివరకు తెల్లవారు
నప్పుడు లేచి తాను ఒక్కడే బుద్ధుడుండెడి విహారమునకు
పోయెను. అంతకు ముందే బుద్ధుడు లేచి, బయలున ధ్యాన
ములో అటునిటు పచారుచేయుచుండెను. ఆ అనాథపిండికుని
చూచి సుదత్తా! యిటురమ్ము అనెను. తన స్వంతపేరుతో
పిలిచినందున అనాథపిండికుడు సంతోషమును బొంది బుద్ధుని
చేరి వారి పాదముల మీదపడి భగవంతుడు సుఖముగా నిద్రి
చెనా? అని ప్రశ్నించెను. బంధములు విడిపోయిన అర్హం
తుడు, కామములు నశించిన అర్హంతుడు, కామక్లేశకర్మము

లను వదలిన అర్హతుడు మనశ్శాంతికి అడ్డములయిన కమ్మీ లను పగులగొట్టిన అర్హతుడు, పాపరహితుడైన అర్హతుడు, హృదయములోని దాహమును అడచిన అర్హతుడు, శాంతి మధ్య మున స్థిరుడయియుండు. వానికి సుఖముగా నిద్దురపట్టును. అని బుద్ధుడు వానికి జవాబు చెప్పెను. అంతట అనాథపిండికునకు ధర్మబోధచేసి త్యాగముయొక్క మహిమను వర్ణించి వాని హృదయములో జ్ఞానబీజమును నాటెను. అనాథపిండికునకు సత్యస్వరూపము ప్రత్యక్షమయ్యెను. మబ్బువిచ్చినట్లు అను మానము తీరిపోయెను. చిత్తము స్థిరపడెను. బుద్ధుని యందు అతను శరణు జొచ్చెను. శిష్యుడయ్యెను. మరునాడు భిక్షకు పిలిచెను. బుద్ధుడు సమ్మతించెను.

అనాథపిండికునకు రాజగృహనగరములో స్వంత ఇల్లు గాని, ఆస్తిగాని లేదు. అందుచే ఇతని బావమరిదిని తగినసహా యము చేయుమని అనెను. ఆనగరపాలకుడు సహాయము చేతుననెను. ఆమగధరాజు సహాయము చేతుననెను. వీరంద రికిని అతను కృతజ్ఞతను తెలిపి తన ధనము తోడనే బావమరిది యింట విందు నేర్పరచెను. వేకువ బుద్ధుని సంఘమును పిల చెను. వారికి తానే వడ్డించి శ్రద్ధాభక్తులతో భిక్ష పూర్తి చేసెను. అప్పుడు బుద్ధుని సమీపించి వచ్చే చాతుర్మాస్యాలు తాము, తమ సంఘమును, శ్రావస్తీనగరములో జరుపు డని వేడుకొనెను. తథాగతులు ఏకాంతవాసమును కోరు దురు. అని బుద్ధుడు పలికెను. భగవంతుడా! సుఖవంతుడా! నేను గ్రహించితిని. అని అనాథపిండికుడు మనవి చేసెను.

అంతట అనాథపిండికుడు రాజగృహనగరములోని పనులు పూర్తి చేసుకొని శ్రావస్థీనగరమునకు వెళ్ళుచు దోవలో నుండిన చుట్టములకు, స్నేహితులకు, యెరిగిన వారికి బుద్ధదేవుడు యవతరించి నాడనియు, ఆయన చాతుర్మాస్యలకు శ్రావస్థీ నగరము దయచేయుననియు, ఈదోవనే ప్రయాణము చేయుననియు, తెలిపెను. మధ్యమధ్య సత్రములు కట్టుడనియు, విడుదులను యేర్పరచుడనియు, కానుకలను యర్పించుడనియు, వారలను పురికొల్పెను. తన పట్టణముచేరి చుట్టుప్రక్కల శోధించెను. పట్టమునకు దూరముగాక, దగ్గరయుగాక, రాకపోకలకు అనువయి చూపరులకు తేలికయయి, పగలు జనసమర్దము లేక, రాత్రియందు భయము లేక, గాలి, ఎండయు తగులకుండ యుండునట్టియు, ప్రదేశము యేదియని చూచెను. అన్నివిధముల సరిపోవునది ఒక్కవనము కనపడెను. అది యచ్చటి రాజకుమారుడగు జేతునకు చెందినది. వాని వద్దకు బోయి యీవనమును తనకు అమ్మమనియడిగెను. అది అమ్మదలచినదికాదు. దానిమీద సందులేకుండ ధనము పరచినను, అమ్మను అనెను. అట్లు నీవు కోరిన ధనమును పరచెదను. అని అనాథపిండికుడు చెప్పెను. నేను మాటయివ్వలేదే యని జేతుడనెను. వారిద్దరును తీర్పరులవద్దకుబోయిరి. అనాథపిండికుడు దానిమీద ద్రవ్యము పరచునట్టును, దానిని జేతుడమ్మునట్టును వారు తీర్మానించిరి. అంత యనాథపిండికుడు యింటికి కబురుపంపి బండ్లమీద బంగారు నాణెములు తెప్పించెను. తోటయంతయు పరచిరి. చివరకు వాకిలి వద్ద కొంత

మేరకు చాలకపోయెను. తిరిగిఅనాథపిండికుడు కొరవ ధనము తెచ్చుటకు బాడ్లను యింటికి పంపుచుండెను. జేతుడు ఆశ్చర్యపడి, బాడ్లను ఆపి, ఆమిగిలిన చోటును నేనే దానము చేతును. నీవు ఒక గొప్పకార్యమును తలపెట్టినావు, అని అనాథపిండికునితో చెప్పెను. ఈ జేతుడు ప్రఖ్యాత పురుషుడు. ఈతను బుద్ధునికి శిష్యుడైన మేలు అధికముగా నుండును. అని అనాథపిండికుడు యోజించి ఆభాగమును జేతుడే దానము చేయునట్లు యంగీకరించెను. దానిపై జేతుడు ఒక దర్వాజానుపెట్టి ముఖమండపము కట్టించెను. ఆ తోటలో నివాసగృహములును, గిడ్డంగులును, సభాశాలలును, స్నాన పుగదులును, కసరత్తుశాలలును, భావులును, భావులపై పందిళ్లును, చెరువులును, నిద్రకు గదులును' మొదలగు అవసరమైన కట్టడములన్నింటిని కట్టించెను.

బుద్ధుడును, బుద్ధ భిక్షువులును దీనిని అంగీకరించి, కృతజ్ఞతను చూపిరి. ఒకప్పుడు ఒక ప్రదేశములోనుండు భిక్షు సంఘములో కల్తలు పుర్పడెను. అట్లు కక్షలు యేర్పడి నప్పుడు యెట్లు ప్రవర్తించవలెనని అనాథపిండికుడు బుద్ధుని అడిగెను. ఓగృహస్థా ! ఉభయకక్షులవారును కానుకల నిమ్ము. ఇచ్చి ఉభయుల యభిప్రాయములను వినుము. విని బుద్ధధర్మ ప్రకారము యెవరి అభిప్రాయము కలదో వారి యభిప్రాయ మును విశ్వాసమును, సిద్ధాంతమును అంగీకరించుము, అని బుద్ధుడు అతనికి బోధించెను.

—...—

